యించువారల పాపంబులఁ బోఁగొట్టువాఁ డగుట హరి యనం
బడును. "హరిర్హరతిపాపాని" యనికదా ! స్మృతివచనము.
లోకంబులు అనాదికాలంబునుండియు సంచితంబైయుండు
పాపంబున మగ్నంబులై యేదియో యొకసుకృతవిశేషంబున
స్వదుస్స్థితి నెఱింగి తదుద్ధరణంబునకు వేఱుశరణముంగానక సర్వ
రక్షకుండగు పరమేశ్వరు నాశ్రయించినప్పు డాసమయంబున
తద్రక్షణంబునకు అనేకకాలంబునుండియు వానిచే నాచరింపఁ
బడిన దుష్కృతములను గణనచేయకుండుటకు క్షమయు,
దయయు, అన్యమగుగతి నెఱుంగక విషణ్ణుఁడై తన్నాశ్ర
యించినవాని విషాదమును ఆర్తిని నిశ్చలమగుభక్తిని యెఱుంగు
టకు జ్ఞానమును, తద్రక్షణమునకు శక్తియు, నీమొదలగు ననేక
శుభగుణంబు లావశ్యకంబులగుట నీవ్యుత్పత్తిచేఁ గల్యాణగుణా
కరుం డగుట యేర్పడుచున్నది. లేక హరతి స్వవశంకరోతి సర్వ
మితి హరిః, చిద చిదాత్మకంబు లగుసర్వలోకంబులును తనకు
ధార్యంబులును తాను వానికి ధారకుండును నగుటచే వానినన్నిటి
నాహరించి స్వవశంబున నుంచుకొనును గాన హరియనంబడు.
ఇట్లు సర్వధారకుం డగుటచే ఏకపాత్త్రిపాద్రూపంబు లగులీలా
విభూతి నిత్యవిభూతులకు నాయకుండగుట చెప్పంబడియె.
హరతి దేవానితి హరిః, సృష్టిస్థితిసంహారంబులకు కారకులుగ
నేర్పడియుండు బ్రహ్మేంద్రరుద్రయమాదిదేవతలను ప్రలయ
కాలంబున సంహరించి స్వాధీనులం జేసికొనువాఁడు గాన హరి
యనంబడును. "హరిం హరంత మనుయాంతి దేవాః" అనియు
"బ్రహ్మాణ మీశం రుద్రంచ యమం వరుణ మేవచ, ప్రసహ్య

మాలు "సమస్తాచిత్తులు", వాని "విధానము" చేత. అందు "ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థ సత్తా నిత్యం ప్రియా స్తవ తు కేచన తే హి నిత్యాః" అనునట్లు నిత్యులు నిత్యమైన అసంకుచిత జ్ఞానముకలవారగునట్లు నిత్యేచ్ఛచే సంకల్పించుటయు, ముక్తులు అపహతపాప్మత్వాదిగుణాష్టక మావిర్భవించి తదుచితమగునట్లు స్వసారూప్యము ననుభవించునట్లు సంకల్పించుటయు, బద్ధులు స్వకర్మానుగుణంబుగ ఇంద్రియజ్ఞానాదులయం దెచ్చుతగ్గులం గలిగియుండు కరణకళేబరంబులు గలుగువారుగ సృజించుటయు "చిద్విధాన" మగును. మఱియు శుద్ధసత్త్వ ప్రకృతిని నిత్యవిభూతియందు నిత్యముక్తానుభవ యోగ్యంబుగ విమానములు మంటపములు మండిపములు ప్రాసాదములు నను నీ మొదలగురూపంబుల సృజించుటయు, మిశ్రసత్త్వప్రకృతిని సంసారిచేతను లనుభవించుట కనుకూలముగ నండంబులుగను తదావరణంబులుగను చతుర్దశభువనంబులుగను దేహేంద్రియాదులుగను ఇట్లనేకవిధంబుల భోగ్యములుగను భోగస్థానములుగను భోగసాధకములుగను సృజించుటయు, సత్త్వశూన్యంబగు కాలంబును కల, కాష్ఠము, ముహూర్తము, మాసము, అయనము, పక్షము నను నీవిధంబుల సృజించుటయు "నచేతన విధాన" మగును. ఇట్టి చిదచిత్తుల సృష్టి వానిస్థితికిని సంహారమునకును సూచకము. వానియందలి "వ్యసనము" ఆసక్తి. "లోకవత్తు లీలాకైవల్యం" మనునట్లు కేవల లీలాప్రయోజనకమగు నీసృష్టియందు బాలున కాటలయందుంబలె ఆసక్తి యెందుగదా? లేక "వ్యసన" మనంగ నాయాసము. సర్వే

చున్నవి. అట్టి 'ఆలోకైః' దయాపరిపూర్ణములైన చూపులచేత. 'ఆలోకైః' స్వాశ్రితవర్గములోనివారికిఁ గలుగఁబోవు అత్యుత్తమ పదవిని దలంచుటచేఁ గలిగిన యానందముచే నిర్భరములైన చూపులచేత. 'ఆలోకైః' సర్వేశ్వరుఁడు దేనిప్రసారముచే తనకృత్యమునకు సార్థకత నెంచుకొనునో అట్టి చూపులచేత. 'సార్థయంత్యై' సఫలములుగఁ జేయునది. ఇట్టి ప్రసారమె జరుగదేని సర్వేశ్వరుఁడు తనకృత్యమునకు విరసత నాపాదించుకొనును. 'అంగీకారిభి రాలోకైః సార్థయంత్యై' సర్వేశ్వరుఁడును ఆమె యంగీకారము నపేక్షించునంతటి యాధిక్యముం గలిగియుండుటచే సర్వేశ్వరునకును ఈశానయా? యని తోఁపింపఁజేయు వైభవసమృద్ధిగలది. 'స్మితవికసితగండం వ్రీడవిభ్రాంతనేత్రం ముఖ మపనమయంతీ స్పష్టమాచష్ట సీతా' యనునట్లు నేత్రములచేతనే యంగీకారము సూచింపఁబడుచున్నది. ఇంతవఱకు నీశ్వరుఁడే జగజ్జన్మాదులకుఁ గారణభూతుఁడనియు లక్ష్మితదనుమోదనముచే దానికుత్తంభకురాలనియుఁ జెప్పి లక్ష్మియొక్క పరత్వస్వరూపము చూపఁబడినది. ఇఁక సౌలభ్యస్వరూపము చూపఁబడును.

'శ్రియై' శ్రయతి సర్వేశ్వర మితి 'శ్రీః' అనన్యార్హత్వపారతంత్ర్యాది విలక్షణగుణములచే సర్వేశ్వరు నాశ్రయించియుండి తమగుణమును వికసింపఁజేసి స్వస్వరూప పరస్వరూపములకు భంగము కలుగకుండ నుండునది. శ్రియతే భక్తై రితి 'శ్రీః' ఇంతకుఁబూర్వము చూపఁబడినట్లు కేవలపరత్వధర్మములే గాక ఆశ్రయణ సౌకర్యాపాదకంబు లగు సౌశీల్యసౌలభ్యాదులును గూడ

శ్లో. ఉల్లాసపల్లవితపాలితసప్తలోకీ
నిర్వాహకోరకితనేమకటాక్షలీలాం,
శ్రీరంగహర్మ్యతలమంగళదీపరేఖాం
శ్రీరంగరాజమహిషీం శ్రియమాశ్రయామః. 2

టీ. ఉల్లాస...లీలాం-ఉల్లాస = సృష్టిచేత, పల్లవిత=చిగురు బుట్టినదియు, పాలిత=సంరక్షింపఁబడిన, సప్తలోకీ = సప్తలోకములయొక్క, నిర్వాహ=స్థాపనము చేత, కోరకిత=మొగ్గఁదొడిగినదియు, (నగు) నేమ=సగమగు, కటాక్ష=చూపులయొక్క, లీలాం=విలాసముగలదియు, శ్రీరంగ...రేఖాం - శ్రీరంగ = శ్రీరంగనగరమందలి, హర్మ్య=రాజమందిరముయొక్క, తల=ప్రదేశమునకు, మంగళ=మంగళార్థమైన, దీపరేఖాం=దీపకళికయు, శ్రీరంగ...మహిషీం - శ్రీరంగరాజ=శ్రీరంగనాథునియొక్క, మహిషీం=పట్టమహిషియగు, శ్రియం=లక్ష్మీదేవిని, ఆశ్రయామః = ఆశ్రయింతుము.

వి. వి. ఇచ్చట నిర్వాహణమునఁ జూపఁబడిన సప్తలోకీశబ్దమునకుఁ సంక్రమముఁ జేసి అనుషంగముచే నుల్లాసశబ్దముతో నన్వయించుకొనవలయును. అట్లు అసత్కార్యరూపముగ చేర్పడినదిగాక సూక్ష్మావస్థాపన్నమగునది స్థూలావస్థనందునట్లు చేయుట యిచ్చట సప్తలోక్యాః ఉల్లాసః' అని చెప్పఁబడినది. స్వశరీరము యొక్క సంకుచితావస్థ శరీరికి బాధాజనకమును అతృప్తిజనకమును నగుటచే శరీరి శరీరము నుల్లసింపఁజేయ శరీర శరీరులిద్దఱితోడను బాధ్యతగలవారి కుల్లాసము కలుగకుండునా? జీవలోకసముల్లసనపరి

మును విడిచి సర్వసులభుండై రంగనాయకుండై యవతరించి కృతాభిషేక యగుతానును రంగమహిషియై యవతరించినస్థితి "శ్రీరంగరాజమహిషీం" అని చెప్పఁబడినది. ఇట్లు సర్వసమాశ్రయణీయరైయై వెలయుచుండు శ్రీదేవి నాశ్రయింతుము.

తా. సర్వేశ్వరుండు సూక్ష్మావస్థాపన్నమై సంకుచితాస్థితియందుండి స్వరూపస్వభావాదిగుణముగ జ్ఞానానందానుభవమునకు యోగ్యత కలిగియుండియు తదనుభవములేక యచిత్తుంబోలియుండు జీవలోకంబును నిర్హేతుక కృపావిశేషంబున నుద్ధరింపం దలంపుఁగొని లోకంబులసృష్టిస్థితికిఁ దీసికొనిరా పల్లవితమయ్యె, సృష్టమైనలోకంబుల సరియైనస్థితియందుంచి రక్షించుచుండ కోరకితమయ్యె, జీవకోటియొక్క ఆత్యంతకోచనీయంబగు నాయవస్థను కృపాపూర్ణంబు లగునాకన్నులతోఁ గనలేక మును సంకుచితము లైనయాగన్నులు, జీవోద్ధరణమునకు మార్గ మేర్పడుచుండుటచే నేమవికసితములై గటాక్షలీలలఁ బ్రసరింపఁ జేయుచుండ సర్వేశ్వరుండు సౌలభ్యసౌశీల్యంబుల కాటపట్టగు నర్చారూపంబునంది లోకోద్ధరణంబునకై శ్రీరంగనాయకుండై యవతరింప ఆనపాయిని యగుతానును పట్టమహిషియై యవతరించి రంగనాథుని రాజభవనంబునకుఁ బ్రకాశకురాలై మంగళదీపరేఖవలె యొప్పుచుండు లక్ష్మీదేవిని ప్రారీప్సితగ్రంథపరిసమాప్తి గలుగుటకొఱ కాశ్రయింతుము.

అవ. పైఁజెప్పఁబడినయట్లు నిరతిశయకృపాకరంబులగు లక్ష్మీకటాక్షంబులు స్తుత్యుద్యుక్తుండ నగునాయందుఁ బ్రసరించుఁ

రుఁడు లక్ష్మీదేవి "తనుకాండ"ము నాలింగనము జేసుకొను నప్పుడుగాని, తన తనుకాండముచే లక్ష్మీదేవి నాలింగనముజేసు కొనునప్పుడుగాని ప్రతిక్షణమును విజృంభమాణమై ప్రకాశించుచుండు ననుతాత్పర్య మేర్పడును. "తనుకాండ" మను టచే లక్ష్మీదేవిశరీరముయొక్క బృహత్త్వము చెప్పఁబడినది. పిమ్మట "ఆనుకలతనుకాండాలింగనారంభశుంభ స్తి+ ప్రతిదిశ భుజశాఖ శ్రీసఖానోకహర్ధిః, యస్యాః సా" యని బహు వ్రీహిసమాసము. "ప్రతిదిశభుజశాఖ" యని "ప్రతిదిశ" శబ్దముచే చతుర్భుజత్వమును, "భుజశాఖ" యనుశాఖావయ్య ముచే భుజములయొక్క దైర్ఘ్యమును వర్తులత్వమును జెప్పఁ బడినవి. "శ్రీసఖు" నకు "అనోకహ" మును ఉపమానముగఁ జెప్పుటచే "వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేకః" అను శ్రుతిచేఁ జెప్పఁబడిన ఆనందనిర్భరుఁ డగుటచేఁ గలుగు స్తబ్ధస్థితిగాని "వామదేవతరుచ్ఛాయా నాలిశితా నఘుర్నదా" యనుస్మృతిచేఁ జెప్పఁబడిన భవాధ్వశ్రాంతులగువారికి విశ్రాంతిస్థాన మగుట గాని సూచిత మగుచున్నది. "స్తన...ద్విరేఫా" యనుపదము నకు స్తనౌచ+నయనేచ = స్తననయనం; స్ఫారపుష్పౌఘః+ ద్విరేఫా = స్ఫారపుష్పద్విరేఫాః; గుళుచ్ఛాచ+స్ఫారపుష్పద్విరే ఫాచ=గుళుచ్ఛ స్ఫారపుష్పద్విరేఫం; స్తననయనం + గుళుచ్ఛ స్ఫారపుష్పద్విరేఫమివ, యస్యాస్సా" అని విగ్రహము. పుష్పా దులతో సమానము లగునవయవములు కలిగియుండుటచేతను సకలాభీష్టంబుల నిచ్చునదగుటచేతను లక్ష్మీదేవికి "కల్పవల్లి" యుపమానముగఁ జెప్పఁబడినది."మయి కటాక్షాన్ రచయతు"

టీ. మురారేః = మురాన్తకుఁడగు శ్రీమన్నారాయణుని, స్థిర...తస్యే-స్థిర=స్థావరపదార్థములయొక్కయు, చర=జంగమ పదార్థములయొక్కయు, రచనా=సృష్టియొక్క, తారతమ్యే=హెచ్చుతగ్గులయందు. యద్భ్రూభఙ్గాః - యత్ = ఏలక్ష్మీదేవి యొక్క, భ్రూ=కనుబొమలయొక్క, భఙ్గాః = విక్షేపములు, ప్రమాణం=నియామకములో, వేదాన్తాః=ఉపనిషత్తులు, మురభిదురసి-మురభిత్=శ్రీమన్నారాయణునియొక్క, ఉరసి=వక్షస్థలమునందలి, యత్పాదచిహ్నైః-యత్=ఏలక్ష్మీదేవియొక్క, పాద=పాదములయొక్క, చిహ్నైః=గుర్తులచే, తత్త్వచిన్తాం = తత్త్వవిచారమును, తరన్తి=దాఁటుచున్నవో, యా = ఏలక్ష్మీదేవి, భోగ...భావా-భోగ=భోగములయొక్క, ఉపోద్ఘాత = ప్రారంభమునందలి, కేళీ = విలాసముచేత, చులకిత = అల్పముగాఁ జేయఁబడిన, భగవత్=సర్వేశ్వరునియొక్క, వైశ్వరూప=విశ్వరూపతయందలి, అనుభావా=మహిమగలిగినదియో, సా = అట్టి, శ్రీః = లక్ష్మీదేవి, అమృత...స్నైః - అమృత = అమృతము యొక్క, లహరి=తరంగములనెడు, ధీ=బుద్ధిచేత, లంఘనీయైః=పొందఁదగిన, అపాంగైః=కటాక్షములచేత, నః = మమ్ములను, అవ్యాణీతాం = కప్పెడుఁగాక.

తా. సర్వేశ్వరుఁడు తాఁ జేయుకల్పవృక్షచందనరసాల నారికేళస్నుహీ ఖర్జూరార్కగంధశైల పాషాణదృషదాదిరూపంబు లగు స్థావరపదార్థముల సృష్టికిని దేవమనుష్యతిర్యగ్ బ్రాహ్మణక్షత్రియ పశుపక్ష్యాదిరూపంబు లగుజంగమపదార్థముల

మగు కార్యము నుద్యతులగు తమవాక్కులకు స్వస్తి కలుగుంగాక యనుకోరికను సూచించుచు నీశ్లోకంబును చెప్పుచున్నాఁడు.—

శ్లో. యద్వాయావ త్తవ వైభవం తదుచిత
స్తోత్రాయ దూరే స్పృహాః
స్తోతుం కే వయ మిత్యదశ్చ జగదుః
ప్రాఞ్చో విరించాదయః,
అప్యేవం తవ దేవి వాఙ్మనసయో
ర్భాషానభిజ్ఞం పదం
కావాచః ప్రయతామహే కవయితుం
స్వస్తి ప్రశస్త్యై గిరామ్. 5

టీ. హే దేవి-ఓ శ్రీరంగనాయకీ! తవ=నీయొక్క, వైభవం=వైభవము, యత్=ఎయ్యదియో, యావత్=ఎంతటిదో, తదు... స్తోత్రాయ-తత్=దానికి, ఉచిత=తగినట్టి, స్తోత్రాయ=స్తోత్రము కొఱకు, స్పృహాః=ఇచ్ఛ, దూరే=దూరమున, (కలదు) ప్రాంచః=పూర్వులగు, విరించాదయశ్చ=బ్రహ్మ మొదలగు వారును, అదః=ఈవైభవమును, స్తోతుం=స్తుతించుటకు, "వయం=మేము, కే=ఎవరు," ఇతి=ఈలాగున, జగదుః=చెప్పిరి, ఏవమపి=ఈలాగైనను, వాఙ్మనసయోః = వాక్కులయొక్కయుం-మనస్సుయొక్కయుం, భాషానభిజ్ఞం-భాషా=భాషణమునకు, అనభిజ్ఞం=తెలియని, తవ=నీయొక్క, పదం=స్వరూపమును, కవయితుం=వర్ణించుటకు, కావాచః=కుత్సితమైన వాక్కులుగల (మేము) ప్రయతామహే=

యించువారలపాపంబులం బోఁగొట్టువాఁ డగుట హరి యనంబడును. "హరిర్హరతిపాపాని" యనికదా ! స్మృతివచనము. లోకంబులు అనాదికాలంబునుండియు సంచితంబైయుండు పాపంబున మగ్నంబులై యేదియో యొకసుకృతవిశేషంబున స్వదుస్థితి నెఱింగి తదుద్ధరణంబునకు వేఱుశరణముంగానక సర్వరక్షకుండగు పరమేశ్వరు నాశ్రయించినప్పు డామయంబున తద్రక్షణంబునకు అనేకకాలంబునుండియు వానిచే నాచరింపఁబడిన దుష్కృతములను గణనచేయకుండుటకు క్షమయు, దయయు, అన్యమగుగతి నెఱుంగక విషణ్ణుండై తన్నాశ్రయించినవాని విషాదమును ఆర్తిని నిశ్చలమగుభక్తిని యెఱుంగుటకు జ్ఞానమును, తద్రక్షణమునకు శక్తియు, నీమొదలగు ననేక శుభగుణంబు లావశ్యకంబులగుట నీవ్యుత్పత్తిచేఁ గల్యాణగుణాకరుం డగుట యేర్పడుచున్నది. లేక హరతి స్వవశంకరోతి సర్వమితి హరిః, చిద చిదాత్మకంబు లగుసర్వలోకంబులును తనకు ధార్యంబులును తాను వానికి ధారకుండును నగుటచే వానినన్నిటి నాహరించి స్వవశంబున నుంచుకొనును గాన హరియనంబడు. ఇట్లు సర్వధారకుం డగుటచే ఏకపాత్త్రిపాద్రూపంబు లగులీలావిభూతి నిత్యవిభూతులకు నాయకుండగుట చెప్పంబడియె. హరతి దేవానితి హరిః, సృష్టిస్థితిసంహారంబులకు కారకులుగ నేర్పడియుండు బ్రహ్మేంద్రరుద్రయమాది దేవతలను ప్రలయకాలంబున సంహరించి స్వాధీనులం జేసికొనువాఁడు గాన హరి యనంబడును. "హరిం హరంత మనుయాంతి దేవాః" అనియు "బ్రహ్మాణ మీశం రుద్రంచ యమం వరుణ మేవచ, ప్రసహ్య

తా. రంగనాథునిపట్టమహిషి యగులక్ష్మీదేవి కృపాపూర్ణంబు లగుమనోహరకటాక్షంబులఁ బ్రసరింపఁజేసి తనవిషయమున స్తుతిరూపంబులుగాఁ జెప్పఁబడిన మాతృభవాక్యములను అందలియర్థ చమత్కారము శబ్దచాతుర్యము గుణవిశేషములు గుంభనాతిశయములు మొదలగువానియందలి యాధిక్యముఁ గని అత్యాసక్తిని శ్లోకామృతమును పండితులంద అనుభవించునట్లు సర్వవిధముల సంపూర్ణముగఁ దానే చేసికొనుఁగాక.

ఆ. ఉపోద్ఘాతమును ముగించి స్తుతి నుపక్రమింపఁబోవువారై పూర్వశ్లోకమునఁ జెప్పఁబడినవైదగ్ధ్యాదుల వివరించిచెప్పుచు నిదివఱ కాశాసనారూపంబునఁ బ్రార్థింపఁబడిన విషయము నే యిపుడు ప్రత్యక్షముగ వర్ణించుచున్నారు.—

శ్లో॥ అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహిమనసో
దుహానం సౌహార్దం పరిచితమివాథాపి గహనం,
పదానాం సౌభ్రాత్రాదనిమిషనిషేవ్యం శ్రవణయోః
త్వమేవశ్రీర్లక్ష్యాంబహుముఖయవాణీవిలసితమ్.

టీ. హే శ్రీః=ఓలక్ష్మీ! అనా...వద్యం=అనాఘ్రాత=మూఁ జూడఁబడని, అవద్యం=దోషములు కలిగినట్టియు, బహు...ణాహి=బహు=అనేకములగు, గుణ=గుణములయొక్క, పరీణాహి= వైశాల్యముగలిగినట్టియు, మనసః=మనస్సునకు, సౌహార్దం = ప్రీతిని, దుహానం=పిదుకునదియు, పరిచితమివ=అనుభవింపఁబడి నదిబోలె యుండునదియు, అథాపి=అయినను, గహనం=ప్రవేశింపనశక్యమైనదియు, పదానాం=పదములయొక్క, సౌభ్రా

శ్లో. శ్రియః శ్రీ శ్శ్రీరంగే
శయ తవ చ హృద్యాం భగవతీం
శ్రియం త్వత్తోఽప్యుచ్చై
ర్వయమిహ ఫణామ శ్శృణుతరామ్,
దృశౌ తే భూయాస్తాం
సుఖతరళతారే శ్రవణతః
పునర్హర్షోత్కర్షా
త్స్ఫుటతు భుజయోః కఞ్చుకశతమ్. ౨

టీ. శ్రియః=శ్రీదేవికి, శ్రీః=ఆశ్రయభూతుఁడవగు, శ్రీరంగేశయ=రంగనాథుఁడా! తవచ=నీకును, హృద్యాం=హృద్యురాలను, భగవతీం=షాడ్గుణ్యపూర్ణురాలను, శ్రియం=శ్రీదేవిని, త్వత్తోఽపి=నీకంటెను, ఉచ్చైః=అధికముగ, వయం=మేము, ఇహ=ఇచ్చట, ఫణామః=స్తుతింతుము, శృణుతరాం=బాగుగవినుము, శ్రవణతః=వినుటవలన, తే=నీయొక్క, దృశౌ=దృష్టులు, సుఖ...తారే-సుఖ=సుఖముచే, తరళ=చంచలమైన, తారే=కనీనికలు కలిగినవిగ, భూయాస్తాం=అగుఁగాక, పునః=మఱియు, హర్షోత్కర్షాత్-హర్ష=సంతసముయొక్క, ఉత్కర్షాత్=ఆధిక్యమువలన, భుజయోః = భుజములయందు, కంచుకశతం-కంచుక=కవచములయొక్క, శతం=సమూహము, స్ఫుటతు=చిగులును గాక.

వి. వి. "శ్రియతే సర్వైరితి శ్రీః" అనువ్యుత్పత్తిచే సర్వసమాశ్రయభూతురాలగు లక్ష్మికి నాశ్రయభూతుఁడని లక్ష్మి ఈశ్వర వ్యతిరిక్త సర్వశేషిభూతయనియు, ఈశ్వరుఁడు సర్వశేషిభూతుఁ

ఆస్తుతిని వినుటచే నందలి రసానుభవమువలన గలుగు సానం దాతిరేకంబున అర్ధముకుళితములగు నీనేత్రములయందలి తారక ములు చంచలము లగుచుండును. మఱియుం సంతసభరంబున దేహముప్పొంగి యనేకకంచుకములు నీ భుజములయందు పిగులుసట్టి సంభవించును గావున నతి మనోహరమగు నీ మనో హారిణిస్తుతిని అధికమగు నాసక్తితో నాలకింపుము.

అవ. "శ్రీగుణరత్నకోశ" మను నీ స్తోత్రముయొక్క నామమున కర్థమును సూచించుచు శ్రీగుణములు శ్రుతిస్మృతి ప్రతిపాదికములని నిరూపించుచు స్తుతినుపక్రమించుచున్నారు.-

శ్లో. దేవి శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంస
స్త్వత్సద్గుణౌఘమణికోశగృహం గృణన్తి,
తద్ద్వారపాటనపటూని చ సేతిహాస
సంతర్కణస్మృతిపురాణపురస్సరాణి. 10

టీ. హే దేవి=ఓ శ్రీదేవీ! ప్రథమే=పూర్వులగు, పుమాంసః=పురుషులు, భగవతీం=మాహాత్మ్యయుక్తమైన, శ్రుతిం=వేదమును, త్వత్ ...గృహం-త్వత్=నీయొక్క, సద్గుణ=సద్గుణముల యొక్క, ఓఘ=సమూహమనెడి, మణి=మణులయొక్క, కోశ= సమూహముయొక్క, గృహం = స్థానమునుగాను, సేతి... పరాణి- సేతిహాస = ఇతిహాసములతోఁ గూడిన, సంతర్కణ = న్యాయములును, స్మృతి=స్మృతులును, పురాణ=పురాణములును, పురస్సరాణి = మొదలుగాఁగలిగినవి, తత్ ...పటూని-తత్ =

త్యాదిపదమునందలి "త్వత్సద్గుణ శబ్దముచే "శ్రీగుణ" శబ్దమును "మణికోశ" శబ్దముచే "రత్నకోశ" శబ్దమును అనుస్మారితములై శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడియుండు శ్రీగుణములే యీస్తోత్రమునను నుపవర్ణితములగునని సూచితమగుచున్నవి.

అవ. ఇట్లు శ్రీగుణములు వేదచోదితము లనిచెప్పి యట్టి వేదంబులఁ బ్రమాణంబులుగ నంగీకరింపకయు నంగీకరించియు అన్యథార్థకల్పనములఁ జేయుచును గొందఱుండుటకు కారణము నీకటాక్షపాతము లేకుంటయే యని చెప్పుచున్నారు.—

శ్లో. ఆహు ర్వేదానమానం
కతిచన కతిచారాజకం విశ్వమేతత్
రాజన్వ త్కేచి దీశం
గుణినమపి గుణై స్తం దరిద్రాణమన్యే,
భిక్షావన్యే సురాజం
భవమితి చ జడాః తే తలాతల్యకార్ష్ణ
హ్యే తే శ్రీరంగహర్మ్యాం
గణకనకలతే న క్షణం లక్ష్యమాసన్. 11

టీ. శ్రీరంగ...లతే-శ్రీరంగ = శ్రీరంగమందలి, హర్మ్య= విమానముయొక్క, అంగణ=ముంగిలియందలి, కనకలతే=బంగరుతీఁగవంటి నో లక్ష్మీ! యే=ఎవ్వరు, క్షణంచ = క్షణకాలమును, తే=నీకు, లక్ష్యం = విషయమైనవారలు, నాసన్ = కాలేదో,

నియుఁ జెప్పుచు క్షేత్రక్షేత్రజ్ఞు లుపాదానమై వివిధమై విచి
త్రమై భూభూధరసముద్రాదిరూపంబగు బ్రహ్మాదిపిపీలికాంతం
బగు నగునీలోకంబునకంతకు నీశ్వరుండగువాఁడొకఁడు లేఁడం
దురు. కణాదాదులగుకొందఱు అనుమాన ప్రమాణముచే నూహిం
పఁబడుచు నిమిత్తకారణముగమాత్ర ముండునీశ్వరు నంగీకరిం
తురు. మాయావాదులగు మఱికొందఱు "పరాస్యశక్తిర్వివిధైవ
శ్రూయతే, స్వాభావికీ జ్ఞానబలక్రియాచ". "యస్సర్వజ్ఞస్సర్వ
విత్" "అపహతపాప్మా" "సత్యకామ స్సత్యసంకల్పః"
"తస్మిన్ యదన్త స్తదన్వేష్టవ్యం" "తస్మిన్ కామా స్సమా
హితాః" "తేజోబలైశ్వర్యమహావబోధసువీర్యశక్త్యాదిగుణైక
రాశిః" "సంఖ్యాతుం నైవ శక్యంతే గుణా దోషాశ్చ శార్ఙ్గిణః,
అనంత్వా త్ప్రథమో రాశి రభావాదేవ పశ్చిమః" అను వి
మొదలగు ననేకశ్రుతిస్మృతిబోధితములగు ప్రమాణములచే నీశ్వ
రుఁడు అపరిమితకల్యాణగుణంబుల కాకరుండని సిద్ధమగుచున్నను
గుణవిహీనుఁడని వక్కాణింతురు. శైవాదులగునితరులు భిక్షువగు
శివుఁ డీశ్వరతత్త్వమని నిరూపింతురు. ఇట్లు చెప్పుచు వీరందఱును
తమతమవాదంబులయందు రోషంబుచేఁ బరస్పరము చేతులం
జేతులఁగొట్టుకొనుచు జగడమాడుచుందురు. వీరలిట్లు చేయుటకుఁ
గారణము "జాయమానం హి పురుషం యం పశ్యేన్మధుసూదనః,
సాత్త్వికస్సతు విజ్ఞేయ స్సవై మోక్షార్థచింతకః" అను ప్రమాణ
ముచే నుపలక్షితమైనట్టియు "స శ్లాఘ్య స్స గుణీ ధన్య స్స కులీన
స్స బుద్ధిమాన్, స శూర స్సతు విక్రాంతో యం త్వం దేవి నిరీ

మిగులగూఢమగు, నిధిమివ=నిధినివలె, వీక్షమాణాః=చూచుచున్న వారలై, యే=ఏ, ధన్యాః=ధన్యులగువారు, భుంజతే=అనుభవించు చున్నారో, తే=వారు, దైవీం=దేవసంబంధమగు, సంపదమభి= సంపదనుద్దేశించి, జాతాను=పుట్టినవారుగదా.

తా. షాడ్గుణ్య పరిపూర్ణవై యొప్పుచుండునో లక్ష్మీ ! పర్వత శిఖరాదులయందు రహస్యముగనుండు నిక్షేపంబులను పూర్వ జన్మార్జితమగు పుణ్యకర్మపరిపాకముచేననుభవించుటకుతగినసుకృత విశేషముతో జన్మమునొందియుండువారు రచనావిశేషములతో నొప్పుచుండు అంజనములచే దృష్టి ప్రకాశమానమై యొప్పు చుండఁ నిధులం జూచి తెలిసికొని ఎవ్వరికిని దెలియకుండులాగున నావిషయమును రహస్యముగ నుంచి తామనుభవించుచుండునట్లు దైవికమగు మోక్షసంపదననుభవింప నుద్దేశింపఁబడి జాయమాన కాలమందు మీకటాక్షప్రసాదవిశేషముకలిగి యొప్పుచుండు ధన్యాత్ములగువారు నీయందు భక్తిగలిగి దానిచే మనస్సున జ్ఞాన నేత్రముద్దీపితమై వెలుఁగుచుండు వేదాంతములయందు గూఢ ములై విలసిల్లుచుండు నీమహిమావిశేషంబులంగని యనుభవింపుచు నానందించుచుందురు. "తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం" "గుహాహితం గహ్వరేష్టం పురాణం తద్యథా హిరణ్యనిధిం నిహిత మక్షేత్రజ్ఞా ఉపర్యుపరి సంచరంతో న విందేయుః" "దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీ మతా" అని యివి మొదలుగాఁగలుగు శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁబడియుండునట్లు వేదాంతబోధితమై గూఢముగనుండు నీమహిమ నెఱింగి యనుభ

తా. "అస్యేశానాజగతః" (ఈజగత్తునకీశ్వరి) యనుశ్రుతిచే వర్ణ్యమానము చేయఁబడుచుండు నీయైశ్వర్యసమృద్ధిని తదితరములగు సౌందర్యసౌకుమార్యాదిసమస్త సమృద్ధులను "హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతప్రభాం" అనునవి మొదలుగఁ గలుగు వాక్యములచే శ్రీసూక్త మొకదానివెంట మఱియొకదానినిగ అధికముగ స్తుతించుచున్నది. పురుషసూక్తమున "పురుష ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చ భవ్యం, ఉతామృతత్వ స్యేశానః" ఇత్యాదివాక్యములచేతను ఇతరోపనిషత్తులచేతను "ఒకానొకఁడు జగత్తుల నియమించుచున్నాఁ" డని చెప్పఁబడిన పురుషుని "అద్భ్యస్సంభూత" ఇత్యాద్యుత్తరానువాకమును "హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ" ఇత్యాదిశ్రుతులును సిరిపతిగ స్తుతించుచున్నవి. పురుషసూక్తాదులయందు "పురుషశబ్దముచే గ్రహింపఁబడి ఐశ్వర్యాదిసమృద్ధివంతుఁడుగ నిరూపింపఁబడినవాఁడు సిరిపతి" యని నిన్ను వానికి నిరూపకధర్మముగ గ్రహించి నిర్ధారణము చేయఁబడె ననుట. సర్వేశ్వరుని నిరూపించుటకుఁగూడ నిన్నే యాధారముగ గ్రహించియుండుటచే నీసమృద్ధిని ప్రతిపాదించుచున్నవని తాత్పర్యము. ఇట్లు శ్రీసూక్తమును పురుషసూక్తమును నారాయణ మహోపనిషత్తులును నీమొదలగునుపనిషత్తులన్నియుం సాక్షాత్తుగను సర్వేశ్వరుద్వారముగఁ గానియుం నీ సకలసమృద్ధుల నభివర్ణించుచున్నవి.

అ. వేదములును స్మృతీతిహాసపురాణాదులును లక్ష్మీవైభవప్రతిపాదకము లగుటను నిరూపించుచున్నారు.—

నిమహిమాతిశయవర్ణనమే ప్రధానముగ నుంచుకొని యున్న దనుట. మఱియు నోతల్లి! వ్యాసపరాశరాదులగు స్మృతికర్తలంద ఱును మహాభారతవిష్ణుపురాణాదికమగు నితిహాస పురాణాదులచే వానికుపబృంహ్యములుగ నుండు వేదములు నీమహిమల విషయమై ప్రమాణములని చూపియున్నారు. ఇట్లు శ్రుతిస్మృతీతిహాస పురాణాదులన్నియు నీమహిమలకు ప్రమాణములై యున్నవి.

అ. ఇట్లు లక్ష్మీవైభవమునకు ప్రమాణములను నిరూపించి యిఁక వైభవమును వర్ణించుచున్నారు —

శ్లో. ఆ కుగ్రామనియామకా దపి విభో
రా సర్వనిర్వాహకా
దైశ్వర్యం య దిహోత్తరోత్తరగుణం
శ్రీరంగభర్తుః ప్రియే,
తుఙ్గం మఙ్గళ ముజ్జ్వలం గరిమవత్
పుణ్యం పునః పావనం
ధన్యం య త్త దదశ్చ వీక్షణాధనః
తే పశ్యమా విప్రుషః. 1౭

టీ. శ్రీరఙ్గభర్తుః=శ్రీరంగనాథునియొక్క, ప్రియే=ప్రియు రాలవగు నో లక్ష్మీ! ఇహ = ఇచ్చట, ఆకుగ్రామనియామకాత్= కుగ్రామముయొక్క అధికారియగువాఁడు మొదలుగ, సర్వ నిర్వాహకాత్=సమస్తమునకును నిర్వాహకుఁడగు, ఆవిభోరపి= ప్రభువగు బ్రహ్మపర్యంతమును, ఉత్తర...గుణం_ఉత్తరోత్తర=

దృప్యద్దన్తావళస్థో న గణయతి నతాన్
యత్ క్షణం క్షోణిపాలాన్,
యత్తస్మై తిష్ఠతే౽న్యః కృపణ మశరణో
దర్శయన్ దన్తపంక్తిం
తత్తే శ్రీరంగరాజప్రణయిని నయనో
దఞ్చితన్యఞ్చితాభ్యామ్. 16

టీ. హే శ్రీరంగరాజప్రణయిని = రంగనాథుప్రియురాలవగునో లక్ష్మీ! ఏకః=ఒక, మనుష్యః=మనుష్యుఁడు, దృప్య...స్థః- దృప్యత్ = మదించిన, దన్తావళ = గజమున, స్థః=ఉన్నవాఁడై, ముక్త...మౌళిః- ముక్త = ముత్తియముల, ఆతపత్ర=గొడుగున, ప్రచల=కదలుచుండు, మణి=మణులచే, ఘృణాత్కారి=గణగణలాడుచుండు, మౌళిః=కిరీటముగలవాఁడై, నతాన్=నమస్కరించిన, క్షోణిపాలాన్ = రాజులను, క్షణమపి=క్షణకాలమును, నగణయతీతియత్=లెక్కచేయకుండుట యేదికలదో, అన్యః = మఱియొకఁడు, అశరణః=దిక్కులేనివాఁడై, కృపణం=దీనముగ, తిష్ఠతే=కూర్చొనియుండు, తస్మై=వానికొఱకు, దన్తపంక్తిం-పండ్లవరుసను, దర్శయన్=చూపుచు, ఆస్తఇతియత్ = ఉండుటనుట యేదికలదో, తత్=అది, తే=నీయొక్క, నయన...తాభ్యాం- నయన=నేత్రములయొక్క, ఉదంచితన్యంచితాభ్యాం=వ్యాకోచసంకోచములచే, భవతి=అగుచున్నది.

తా. ఓలక్ష్మీ! యీలోకంబున నొక్కొక్కఁడు సామ్రాజ్యమునకంతటికి నధికారియై మదించియుండు నుత్తమమగు నేనుఁ

టీ. హేసుధాసఖి=ఓయమృతసహోదరీ! ఇందిరే = లక్ష్మీ! తవ=నీయొక్క, భ్రూలతా=కనుబొమ, యతోముఖం=ఎవ్వని కభిముఖముగ, విచలిష్యేత్ = చలింపఁదలంపుగొనునో, తతోముఖం=వానికభిముఖముగ, రతిః=ప్రీతియు, మతి... శ్రియః- మతి = బుద్ధియు, సరస్వతీ = వాక్కును, ధృతి=స్థిరత్వమును, సమృద్ధి=పరిపూర్ణత్వమును, సిద్ధి=ఇష్టసిద్ధియు, శ్రియః = సంపదయు, అరే=అన్నియు, బహుముఖం = అనేక తెఱంగులుగల, అహంపూర్వికాం=నేనుముందనుటను, విగాహ్య = ప్రవేశించి, వశంవదాః = అధీనములైనవై, కూలంకషాః = సంపూర్ణములై, పరివవర్తి=ప్రసరించును.

తా. అమృతసహోదరివగునోలక్ష్మీ! నీ కెవ్వనియందైనను దయగలుగుటకుముందు కటాక్షము ప్రసరించుచుఁ దత్పూర్వకమై భ్రూలత కదలనిచ్చగొనఁబడినంతనే వానియందు నీకృపాకటాక్షకార్యములగు సకలలోకప్రీతియు సర్వోన్నతవిజ్ఞానము అమేయమగు వాక్శక్తియు మనస్సు మొదలగువాని యందలిస్థిరతయు సర్వసమృద్ధియు ఇష్టకార్యసంసిద్ధియు సంపదయు ననునివి నేనుముందు నేనుముందనుచు నొకటికన్న నొకటి ముందుగఁ బ్రవేశించి అనేకవిధముల సంపూర్ణస్థితితో నొప్పుచుఁ బుత్రపౌత్రపారంపర్యముగ నివసించియుండును. పైఁజెప్పఁబడిన సర్వసౌభాగ్యంబులు కలుగుటకు హేతువగు నీకృపాకటాక్షము ప్రసరింపనున్నను ప్రసరించుసూచనము లగుపడినంతనె యవియన్నియు సంపూర్ణముగ వచ్చి చేరుననుట.

డుటకుఁ గారణము తత్తత్కర్మానుగుణమై నీకృపాకటాక్షం బులు ప్రసరించుటయు ప్రసరింపకుండుటయునై యున్నది. ఎచ్చట నీకృపాకటాక్షప్రసారముకలుగునో అయ్యది సత్సృష్టి గను, ఎచ్చట నీకృపాకటాక్షప్రసారముకలుగదో అయ్యది యస త్సృష్టిగను పరిణమించునని తాత్పర్యము.

అవ. లక్ష్మీకటాక్షమహిమంబును వర్ణించి యీ సృష్టియం తయు లక్ష్మీవిలాసంబునకు సాధనమనుచున్నారు.—

శ్లో. కాలే శంసతి యోగ్యతాం చిదచితో

రన్యోన్య మాలింగతో

ర్భూతాహంకృతిబుద్ధిపంచకరణీ

స్వాన్తప్రవృత్తేన్ద్రియైః,

అండానావరణైస్సహస్రమకరో

త్తాన్యార్యభవస్వర్గతః

శ్రీరంగేశ్వరదేవి తే వివృతయే

సంకల్పమానః ప్రియః. 19

టీ. శ్రీరంగేశ్వరదేవి = రంగనాథుని పట్టమహిషివగునో లక్ష్మీ! కాలే=కాలము, యోగ్యతాం=సృష్టియోగ్యతను, శంసతి= చెప్పుచున్నదైయుండఁగా, చిదచితోః=చేతనాచేతనతత్త్వములు, అన్యోన్యం=ఒకదానినొకటి, ఆలింగతోస్సతోః = కలిసికొనుచు న్నవైయుండఁగా, ప్రియః=నీప్రియుఁడగుసర్వేశ్వరుఁడు, సంక ల్పమానః=సంకల్పించుచు, భూతా...ఇంద్రియైః-భూత=పంచ భూతములతోడను, అహంకృతి = అహంకారతత్త్వముతోడను,

పుంసా పణ్యవధూవిడమ్బివపుషా
  ధూర్తా నివాయాసయన్
శ్రీరంగేశ్వరి కల్పతే తవ పరీ
  హాసాత్మనే కేళయే. 20

టీ. హే శ్రీరంగేశ్వరి = ఓ శ్రీరంగనాయకీ! పూర్వః పుమాన్=పురాణపురుషుఁడగురంగనాథుఁడు, శబ్దాదీన్=శబ్దము మొదలుగాఁగలుగు, విషయాన్ = విషయములను, ప్రదర్శ్య= చూపి, దాస్యాత్మకం=దాసత్వమనెడు, విభవం = ఐశ్వర్యమును, విస్మార్య=మఱపించి, వైష్ణవ్యా=విష్ణుసంబంధమగు, గుణమాయయా =త్రిగుణమయమగు సృష్టియనెడు ప్రకృతిచేత, ఆత్మనివహాన్= జీవసమూహములను, విప్లావ్య=వంచించి, పణ్యా...వపుషా=పణ్యావధూ=వేశ్యాస్త్రీని, విడంబి=అనుకరించు, వపుషా=దేహముగల, పుంసా=పురుషునిచేత, ధూర్తానివ=ధూర్తులనువలె, ఆయాసయన్ =ఆయాసపెట్టుచు, తవ=నీయొక్క, పరీహాసాత్మనే = హాస్యరస రూపమగు, కేళయే = క్రీడకొఱకు, కల్పతే = సమర్థుఁడగు చున్నాఁడు.

తా. ఓరంగనాయకీ! పురాణపురుషుండగు నీప్రియుండు శబ్దస్పర్శరసగంధంబులను ఇంద్రియవిషయంబున నగుపఱచి "విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుం" అనియు "దాసభూతాస్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః" అనియుఁ జెప్పఁబడియుండునట్లు స్వామియగు నీశ్వరునకు వినియోగించుటకై విచిత్రమగు దేహనిర్మాణమును పొంది దాసభూతులై యుండు

పొందువారలకు, సురపురీ=దేవలోకంబులు, దుర్గతిః=నరకమో, సాయుజ్యస్య=భగవత్సాయుజ్యమునకు, యదేవ = ఏస్థానమే, సూతిః=జనకమో, అశవా=లేనిచో, మద్గిరాం=నావాక్కులకు, యత్=ఏది, దుర్గ్రహం=గ్రహింపశక్యముకానిదియో, విష్ణోః=పరవాసుదేవునియొక్క, తత్ = అట్టి, పరమం=ఉత్తమమగు, పదం=స్థానము, తవకృతే=నీనిమిత్తమై, సమామ్నాసిషుః=అభ్యాసము చేయఁబడినది.

తా. లోకమాతవగునో లక్ష్మీ ! మనస్సునకుంగూడ గోచరముగాని వైభవముగలదై రజస్తమోమయములగు ప్రకృతిమండలములకంటె వేఱుపడి సత్త్వమయమై యుండునదియై అనితరసామాన్యములును నప్రాకృతములును నగుపదార్థములతో నొప్పునదగుటచే అద్భుతావహమై కాలవినాశ్యంబగు నీయొకపాద్విభూతివలెగాక కాలావినాశ్యంబై నిత్యంబై యుండునదియై తన్నుపొందువారలకు స్వర్గాదిలోకంబులు నరకతుల్యంబులుగఁ దోఁపఁజేయునంతటి యానందసమృద్ధికలిగినదియై పరమపురుషునితో సామ్యాపత్తిని కలుగఁజేయుస్థానమై వేయేల ఇట్టిదని నిరూపించుటకు వాఙ్మనస్సులకు గోచరముకాని స్వరూపరూపవిభవైశ్వర్యాదులతో నొప్పునదియై విలసిల్లుచుండు నాపరమపదమున నివాసము కొఱకును నీయనుభవముకొఱకును ఏర్పడినదని వేదములయందు విశదముగఁ జెప్పఁబడినది.

అ. నిత్యలీలావిభూతులు లక్ష్మీపరికరములనుటను మఱియొకవిధమునఁ జెప్పుచున్నారు.—

(ఇట్లు) ఏతే=ఇవన్నియు, తవ=నీయొక్క, స్ఫారణే=ప్రకాశము నందు, పరికరాహి=సాధనములుగదా?

తా. ఓ శ్రీరంగనాయకీ! స్థావరజంగమరూపమై యలరారు చుండు నీసమస్తమగు నేకపాద్విభూతి నీక్రీడాస్థానముగను 'త్రిపాదస్యామృతం దివి' యని చెప్పఁబడిన నుత్కృష్టమగు నాపరమ పదలక్షణమగు త్రిపాద్విభూతి నీయొక్క భోగ్య భోగ స్థాన భోగోపకరణరూపంబుగను నేర్పఱుపఁబడి యున్నవి. నిన్నును నీప్రియుఁడగు సర్వేశ్వరుని ఎల్లప్పుడును దర్శించుచు ఆనందచిత్తులై యొప్పుచుండు నిత్యసూరులు నీకింకరకృత్యం బునకై యేర్పఱుపఁబడియున్నారు. బుభుక్షువులుగను ముముక్షు వులుగను నుండుఆస్మదాదులమగు జీవులందఱమును నకించనుల మగుటచే నిర్హేతుకమగు నీకృపచే రక్షింపఁదగినవారివర్గమున చేర్చి యేర్పఱుపఁబడితిమి. సర్వేశ్వరుండు నీయొక్క శేషిత్వ కృత్యమునం దేర్పఱుపఁబడియున్నాఁడు. ఇట్లంతయుం నీకృపాది గుణంబులు ప్రకాశించుటకును నీక్రీడావిహారణంబులు ప్రవర్తిం చుటకును నేర్పఱుపఁబడి యున్నవి.

అ. నిత్యవిభూతియందలి ఆయాభోగ్య విభాగంబుల నఁ వర్ణించువారై మొదట వైకుంఠనగరి నభివర్ణించుచున్నారు.—

శ్లో. ఆజ్ఞానుగ్రహభీమకోమలపురీ
పాలా ఫలం భేజుషాం
యా యోధ్యేత్యపరాజితేతి విదితా
నాకంపరేణ స్థితా,

తా. శ్రీరంగవిమానమునకు శోభాయమానురాలవై విలసిల్లుచుండు నో శ్రీరంగనాయకీ ! సకలభువనసామ్రాజ్యసమ్రాట్టులగు నీయొక్కయు నీవిభునియొక్కయు రాజ్యమగు నిత్యలీలారూపవిభూతికంతకును రాజధానియై యొప్పుచుండు అయోధ్యానగరము నీవిభునివలెనే దుష్టులను కఠినముగ శాసించి దండించుచుండుటచే మిగులభయంకరులుగను శిష్టులనతిదయతో నాదరించుచుండుటచే మిగులసౌమ్యులుగను నగుపడుచుండు పట్టణముయొక్క ఆయావిభాగముల పాలకులచే నొప్పుచుండును. సకలతుచ్ఛకామములనువీడి భగవదనుభవమాత్రనిష్ఠులై మిమ్ముల భజించుచుండుభక్తులకు స్వరూపానురూపమగు సకలఫలముల నొసంగునానందస్థానమై పరమపురుషార్థనిలయమై ప్రాప్యస్థానమై యొప్పునదగుటచే వారికి ఫలస్వరూపమైనదిగనుండును. "యోద్ధుమశక్యా" యనియు "పరైరజితా" యనియు నేర్పడువ్యుత్పత్తులచే నితరులు ముట్టడింప నశక్యమైనదగుట "నయోధ్య" యనియు పరులచే జయింపఁబడనిదగుట "అపరాజిత" యనియు "దేవానాంపూరయోధ్యా" యనియు "విశేషాపరాజితా" యనియు శ్రుతులయందు సుప్రసిద్ధమై వెలయుచున్నది. "పరేణ నాకం నిహితం గుహాయాం" అను మొదలగు శ్రుతులయందు చెప్పఁబడినచొప్పున అండావరణంబుల కవల వ్యాపించియుండు పరమాకాశంబున కవలప్రకృతిసంబంధవిరహితమైయుండును. నీవిభునకును నీకును నిత్యులకును ముక్తులకును అనుకూలములగురీతులనొప్పుచు సకలవిలక్షణములై అతిభోగ్యములై యొప్పుచుండు నానావిధములగు పదార్థరాసు

బడిన, పరికరైః=సాధనములు కలిగినట్టియు, ఆనందనిఘ్నైః.
ఆనంద=ఆనందముచేత, నిఘ్నైః=పరవశులగునట్టి, పుంభిః=పురు
షులచేత (నిత్యముక్తజీవులచేత), సంకీర్ణం=వ్యాప్తమైనదిగను,
అస్థాన...వ్యసనిభిః- అస్థాన=అకారణముగ, రక్షా=రక్షణయందు,
వ్యసనిభిః=వ్యసనముకలిగిన, శార్ఙ్గ...ముఖ్యైః- శార్ఙ్గ=శార్ఙ్గము,
చక్ర=చక్రము, అసి=ఖడ్గము, (ఇవి) ముఖ్యైః=మొదలుగా
కలిగినవానిచే, అభయం = భయరహితమైనదిగను, ఆనందై
కార్ణవం- ఆనంద=ఆనందమునకు, ఏకార్ణవం=ప్రధానసముద్ర
మైనదిగను, ఆహుః=చెప్పుదురు.

తా. హస్త్యద్రిపతిపూర్ణురాలగు నోలక్ష్మీ! వెనుక చెప్పఁబడిన
వైభవముకలిగియుండు వైకుంఠనగరమున మీసభాభవనము
...కయ సమస్తజనులయందు వ్యాపించినదియగుటచే "ఇందరు"
అని యొక్కకట్టడిలేకుండ యెట్లు సర్వజనుల కాశ్రయమై
యుండునో అట్లే ఎందరు కూడినను నిర్బాధకముగ విశ్రమింప
నదైయుండుననియు; మీకెదుటను పరిచర్యలు చేయుటయం
దధికమగుతృష్ణకలిగియుండుటచే నొకరికంటె నొకరుగ ముందు
పరిచర్యాసాధనముల గ్రహించివచ్చుచుండు నిత్యముక్తజీవవర్గ
ముచే సంకులమైయుండుననియు; పరమపదమున భయలేశమై
నను కలుగుట కవకాశము లేకపోయినను మీయందు గల ప్రేమ
విశేషముచే నెల్లప్పుడు నతిజాగ్రతతో శార్ఙ్గము చక్రము
ఖడ్గము మొదలగు దివ్యాయుధములన్నియు కాపాడుచుండు
కావున భయరహితమైయుండుననియు; ఇట్లన్నివిధముల నానం

గుణములయొక్క, విభవైః = సంపదలచేత, త్వాం = నిన్ను, అర్హతా = తగియుండుచుండు, కాంతేన = ప్రియుండగు శ్రీహరితో. అన్యోన్య...గహనాన్ - అన్యోన్య = పరస్పరమునందలి, అద్వైతనిష్ఠా = అభిన్నమగు ఉనికిచేత, ఘన = దట్టమగు, రస = ఆనందముచేత, గహనాన్ = నిబిడములగు, భోగాన్ = భోగములను, బభ్నాసి = నిర్మించుచున్నావు.

తా. ఓ శ్రీరంగనాయకీ! ఆమణిమంటపమున పూలమాలికలు పఱచినట్లు సుఖమగుస్పర్శమును శోభనమగుగంధమును కలిగి పడగలపై స్ఫురించుచుండు రత్నములకాంతి మేలుకట్టుకు వలెరాణించుచుండ పఱవబడియుండు శేషునిదేహమునే శయ్యగాఁ జేసికొని దానిపై కూరుచుండి నిత్యవిభూతిరూపముగను లీలావిభూతిరూపముగను నుండు లోకమునంతయు నేకచ్ఛత్రాధిపత్యముగ పరిపాలించుచు విశ్వరూపమహామాయారూపమగు కాంతోచిత యనెడిదశయందలి అసంఖ్యేయములగు నాయాగుణముల పెంపుచే నీకు తగియుండు నీకాంతునితోఁ గూడియుండి మీరిద్దఱకును ఒకరియందొకరికి ప్రతిష్ఠనందియుండు గాఢానురాగమువలన నేర్పడు అభేదదృష్టిచేఁ గలుగుదట్టమగు నానందముచే పూర్ణములగు భోగములను వైకుంఠమునందలి నిత్యులును ముక్తులును ననుభవించులాగున నేర్పఱచుచుందువు. మీరిద్దఱును పరస్పరానురాగబద్ధులై శేషశయ్యపై నుండి యానందించుచుండ ఆద్దానిచే కలుగు నానందమును నిత్యులును ముక్తులును ననుభవించుచుందు రనుట.

గూడ, మహీయథాతథా = భూదేవివలె, త్వామను = నిన్నను సరించి, వర్తంతే=ఉండుచుందురు.

తా. సకలభోగ్యస్వరూపులై వెలయుచుండు నీకును నీప్రియునకును పుష్పములు చందనమున్నగుమైపూఁతలు మొదలగునవి ఏకకాలమున నుపయోగింపఁబడినను పరస్పరవిరుద్ధములై బాధను కలుగఁజేయకుండునట్లాగున పరస్పరబాధకులు కాకనే అనుభవయోగ్యలుగ నుండువారును జలపూర్ణంబులగు చెరువులకు మడుగొమ్ములు అధికజలములను వెడలించి స్వాస్థ్యమునొసంగునట్లు అత్యనురాగయుక్తులగు మీయనురాగమున కొంతభాగమును గ్రహించి మీకు విశ్రాంతినొసంగువారును అగు దేవేరులు భూనీళాదేవులవలె నిన్ననుసరించియుండువా రనేకులు గలరు. నీవు నీసృష్టులు మొదలగువారిచేవలె నాదేవేరులచే నీప్రియుని సంతసింపఁజేతువు.

అ. పరిచారకవైభవమును చెప్పుచున్నారు —

శ్లో. తే సాధ్యాస్సంతి దేవా జనని గుణవపు
ర్వేషవృత్తస్వరూపై
ర్భోగై ర్వా నిర్విశేషాస్సవయస ఇవ యే
నిత్యనిర్దోష గంధాః,
హే శ్రీః శ్రీరంగభర్తు స్తవ చ పదపరి
చారవృత్త్యై సదాఽపి

ములేనివారుగను జ్ఞానశక్త్యాదిగుణములును సౌకుమార్యాదులచే నొప్పుశరీరములును శంఖచక్రాదుల ధరించియుండు వేషంబులును ఆజ్ఞానుగ్రహాదివ్యాపారంబులును, జ్ఞానానందామలత్వాది ఆత్మస్వరూపంబులును దివ్యవిభూతియొక్కయు సర్వేశ్వరునియొక్కయు అనుభవములును సమానముగ కలిగియుండి పరస్పర మింతయు భేదములేక స్నేహితులవలె నొప్పుచు ప్రకాశమానులై యలరారుచుందురు. మరియు మీరిద్దఱకును పరిచర్యలనాచరించుట యందలి యత్యధికమగు ప్రీతిచే భావము ద్రవించి కలుషమైనహృదయము కైంకర్యమునకు త్వరపఱచు నిట్టిప్రవృత్తియే తమకు సుఖదాయక మనుభావముతో నుందురు.

శ్లో. స్వరూపం స్వాతంత్ర్యం భగవత ఇదం చంద్రవదనే
త్వదాశ్లేషోత్కర్షాద్భవతి ఖలు నిష్కర్షసమయే,
త్వమాసీర్మాతః శ్రీః కమితురిదమిత్థం త్వవిభవ
స్తదన్తర్భావాత్త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి.

టీ. చంద్రవదనే= చంద్రునివంటిముఖముకలిగిన ఓలక్ష్మీ! నిష్కర్షసమయే=నిర్ణయకాలమునందు, భగవతః = సర్వేశ్వరుని యొక్క, ఇదం=ఈ, స్వరూపం=స్వరూపమును, స్వాతంత్ర్యం =నిరంకుశస్వాతంత్ర్యమును, త్వత్...ఉత్కర్షాత్ - త్వత్= నీయొక్క, ఆశ్లేష=యోగముయొక్క,ఉత్కర్షాత్ =ఆధిక్యము వలన, భవతిఖలు=అగుచున్నదిగదా? హేమాతః=ఓతల్లీ! శ్రీః= లక్ష్మీ! కమితుః=ప్రియునియొక్క, ఇద...విభవః-ఇదంత్వ = ఇదియగుటయనునట్టియు, ఇత్థంత్వ = ఇట్టిదగుటయనునట్టియు,

శ్లో. తవ స్పర్శాదీశం స్పృశతి కమలే మంగళపదం
తవేదం నోపాధే రుపనిపతితం శ్రీ రసి యతః,
ప్రసూనం పుష్యన్తీమపి పరిమళర్ధిం జిగదిషుః
న చైవం త్వాదేవం స్వదత ఇతి కశ్చిత్కవయతే.

టీ. హేకమలే=ఓలక్ష్మీ! తవ=నీయొక్క, స్పర్శాత్=సంబంధమువలన, ఈశం=సర్వేశ్వరుని, మంగళపదం = మంగళశబ్దము, స్పృశతి=తాఁకుచున్నది, ఇదం = ఈ మంగళపదము, తవ = నీకు, ఉపాధేః=ఉపాధివలన, ఉపనిపతితం=ఏర్పడినది, న = కాదు, యతః=ఎందువలన, త్వం=నీవు, శ్రీః=శ్రీవి, అసి=అయితివో, ప్రసూనం=పూవును, పుష్యంతీం = పోషించెడి, పరిమలర్ధిం-పరిమల=పరిమలముయొక్క, ఋద్ధిం=సమృద్ధిని, జిగదిషుః =చెప్పఁదలఁచిన, కశ్చిత్ అపి=ఒకఁడును, ఏవం త్వాత్ = ఇట్లు అగుటవలన, ఏవం=ఇట్లు, స్వదతే=రుచించుచున్నది, ఇతి=అని, న కవయతేచ=వర్ణింపఁడుగదా!

తా. ఓలక్ష్మీ! 'మంగళం భగవాన్విష్ణు ర్మంగళం మధుసూదనః' 'పవిత్రాణాం పవిత్రంయో మంగళానాంచ మంగళం' అనునివి మొదలగువానిచే సర్వేశ్వరున కుపయోగింపఁబడు మంగళ దము నీయొక్క నిత్యసంబంధమువలననే యేర్పడుచున్నది. నీకీమంగళపదము స్వతస్సిద్ధముగ నేర్పడినదేగాని అన్యసంబంధము వలన నేర్పడినది కాదు. నీవు శ్రీవి గదా; మంగళాలయ యగు దానికి మంగళత్వసిద్ధి కన్యసంబంధ మవసరము కాదనుట ఎట్లన? పుష్పమునకు ఆధిక్యమును కలిగించుపరిమళమును వర్ణింపఁదలంచు

యత్ = చెప్పుటయేదికలదో, సా=అది, రాజ్ఞః = రాజుయొక్క, ప్రశస్తిః=ప్రసిద్ధి, భవతి=అగుచున్నది.

తా. ఓలక్ష్మీ! నీకటాక్షపాతంబు లధికముగ నెవనియందుఁ బ్రసరించునో యాతఁడు పరబ్రహ్మయగుచు. ఒకటిగాంచుకటాక్షములు ప్రసరించిన నట్టివారు రుద్రేంద్రాదులగుదురు. ఇట్లు పరబ్రహ్మ మొదలు వానికి క్రిందియంతరములయందుండు రుద్రేంద్రాదుల వారియొక్క ఆయాయైశ్వర్యమును వైభవమును తద్భేదములును నీకటాక్షప్రసారమువలనను దానియందలి హెచ్చుతగ్గులవలనను ఏర్పడినవిగ నున్నవి. అట్లగుటవలన వేదము పరబ్రహ్మను క్రింది యంతరము నందియుండు రుద్రేంద్రాదులను అభివర్ణించుట యెల్ల నీవైభవము నభివర్ణించుటయే. ఒకరాజుయొక్క పురవైభవమును ధనాగారాతిశయమును మొదలగువానిని రక్షించుట యెల్ల సుపరిపాలకుఁడగు నారాజు నుపవర్ణించుటయే యగునట్లు నీవలన నైశ్వర్యమునందియుండువారలవర్ణించుట నిన్నభివర్ణించుటయే.

శ్లో. స్వతః శ్రీః త్వం విష్ణో
స్స్వమసి తత ఏవైష భగవాన్
త్వదాయత్తర్ధిత్వే
ప్యభవ దపరాధీనవిభవః,
స్వయా దీప్త్యా రత్నం
భవ దపి మహార్ఘం న విగుణం

యతిశయము కలుగునేని దానివలన పైదోషములు కలుఁగవు. లోకమున రత్నమునకు కాంతి సొంతమైనదిగ నున్నది. రత్నమునకు కలుగు నాధిక్యము కాంతివలననే యేర్పడును. అయినను రత్నము కాంతివలన దీనికి గుణ మేర్పడినదేగాని స్వయముగా గుణముకలది కాదని కాని; దీనియాధిక్యమున దీనిస్వాతంత్ర్యము లేదని కాని; ఇతరులవలన దీనికాధిక్యము కలిగినదనిగాని చెప్పఁబడుచుండలేదు. తనకు స్వభావమువలననే సొంతమైయుండు దానివలన నాధిక్యము కలిగినచు తనదిగనె యెంచఁబడును, అట్లె ఈశ్వరుని వైభవమును నని తాత్పర్యము.

అ. ఇట్లు లక్ష్మీస్వరూపము నభివర్ణించి స్వరూపదేహగుణముల వర్ణించువారై ప్రక్రమమున శ్రీ శ్రియఃపతుల కిద్దఱకును సాధారణములై యుండువానిని వర్ణించుచున్నారు.—

శ్లో. ప్రశకనబలజ్యోతిర్జ్ఞానైశ్వరీవిజయప్రథా
ప్రణతవరణప్రేమ క్షేమంకరత్వపురస్సరాః,
అపి పరిమళః కాన్తి ర్లావణ్యమర్చి రితీన్దిరే
తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః.

టీ. హేఇన్దిరే=ఓలక్ష్మీ! ప్రశకన...పురస్సరాః-ప్రశకన=శక్తియుఁ, బల=బలమును, జ్యోతిః=తేజస్సును, జ్ఞాన=జ్ఞానమును, ఐశ్వరీ=ఐశ్వర్యమును, విజయప్రథా=వీర్యప్రశస్తియుఁ, ప్రణత=భక్తులయొక్క, వరణ = స్వీకరించుటయుఁ, ప్రేమ = ప్రీతియు, క్షేమంకరత్వ=హితమునాచరించుటయుఁ, పురస్సరాః=మొదలఁ

యిద్ధతకును, సమానాః=సమానములగు, యౌవనముఖాః=యౌవనము మొదలుగాఁగల, అన్యేఽపి=ఇతరగుణములును, తవ=నీసంబంధమైనవి, తస్మిన్=వానియందును, తస్య=వాని సంబంధమగునవి, త్వయిచ=నీయందును, దర్పణఇవ=అద్దమునందువలె, పరస్పరేణ=ఒకరొకరిచే, సంస్తీర్య=వ్యాపింపఁజేసి, ప్రచురం=అధికముగ, స్వదన్తే=రుచించుచున్నవి.

తా. ఉత్సవంబులఁ గేతువ్రవలె శ్రీరంగపురవైభవమును పెంపొందించునో లక్ష్మీ! యౌవనము సౌందర్యము మొదలుగాఁగల మీయిద్ధతకును సమానములై యుండు పైశ్లోకమున చెప్పఁబడినవియు నితరములైనవియు నగు గుణములన్నియు నీగుణములు నీవిభునియందును నీవిభునిగుణములు నీయందును ప్రతిఫలించి మిగుల రుచ్యములై వెలయుచుండును. ఈగుణములన్నియు మీ యిద్ధతియందును సమానములై యుండుటచే నీగుణములు నీవిభునివిగను నీవిభునిగుణములు నీయవిగను మీచే భావింపఁబడుచు మిగుల రుచ్యము లగుచున్నవనుట. తమ యుత్తమగుణములకంటె తమప్రియుల యుత్తమగుణములు స్వాద్యములుగదా !

ఆ. ఇట్లు శ్రీశ్రియఃపతులకు అభేదము కలిగియుండిన నిత్యముక్తులకు భేదజ్ఞానమెట్లుకలుగునని శంకించి వారియొక్క స్వరూపములయందలి భేదమును చూపుచున్నారు.—

శ్లో. యువత్వాదౌ తుల్యే
ఽప్యపరవశతా శత్రుశమన

విరోధులః దునుమాడుట భయాదికారణము కలిగియున్నను చలింపకుండుట అను నీమొదలగు పురుషులయందుమాత్ర ముండుగుణములు భగవంతునియం దగపడుచుండుటయు స్త్రీలకుమాత్రము ధర్మములైయుండు మార్దవము పత్యధీనత కరుణ ఓర్పు మున్నగు గుణములు నీయందుండుటయుః గని నిత్యులును ముక్తులును మీభేదమును గుర్తించి మిమ్ముల ననుభ వించుచుందురు. క్షమాదులు భగవంతునియందునుగూడ నుండు నవేయైనను అవి స్వాతంత్ర్యాదిమిశ్రములనియు లక్ష్మియం దుండునవి కేవలములనియు వానికి భేదము నెఱుంగుదురు. ఇట్లు భక్తులు స్వరూప గుణభేదమునుబట్టి మిమ్ము నెఱుంగుచుందురని తాత్పర్యము.

శ్లో. ఘనకనకద్యుతీ యువదశా మపి ముగ్ధదశాం
యువతరుణత్వయో రుచిత మాభరణాది పరమ్,
ధ్రువ మసమానవేశవినివేశి విభజ్య హరౌ
త్వయి చ కుశేశయోదరవిహారిణి నిర్విశసి. 35

టీ. కుశేశయోదరవిహారిణి - కుశేశయ = పద్మముయొక్క, ఉదర=గర్భమున, విహారిణి=విహరించెడు లక్ష్మీ ! ఘనకనకద్యుతీ- ఘన = మేఘముయొక్కయు, కనక = బంగరుయొక్కయు, ద్యుతీ=కాంతులవంటి కాంతులను, యువదశాం=యౌవనమును, ముగ్ధదశామపి = మౌగ్ధ్యమును, యువతరుణత్వయోః=యౌవన తారుణ్యములకు, ఉచితం=తగిన, అసమానదేశవినివేశి = భిన్న

టీ. హే శ్రీరంగేశ్వరి = ఓ శ్రీరంగనాయకీ! మృదు... ఉదాత్తైః-మృదు=మార్దవము, శీత=చల్లదనము, ముగ్ధ = సౌందర్యము, మధుర=మాధుర్యము, ఉదార = ఔదార్యము (వను), గుణైః=గుణములతో, తే=నీయొక్క, అంగం=అవయవములను, సంఘటకః=కూర్చెడు, క్షీరాబ్ధేః=పాలసముద్రమువలన, ఇందుః=చంద్రుడును, కల్పలతా=కల్పలతయు, సుధా=అమృతమును, మధుముఖాః=సుర మొదలగునవియు, ఋజీషతాం=నిస్సారములగుటను, ఉపగతాః=పొందింపఁబడినవి, తతః = అందువలననే, మహార్ఘాఃఇతి=మిగుల వెలగలవని, మన్యే = తలఁచుచున్నాను, ఇతి=ఇట్లు, అఖిలాం = కలుషమగు, వర్ణనాం = వర్ణనమును, శాంత...కరం-శాంత = నశించిన, కృత్రిమ = కృత్రిమమనియెడి, కరం=ప్రశంసకలిగిన, దివ్యం=అప్రాకృతమగు, వపుః = దేహము, సార్హతి=తగదు.

తా. ఓరంగనాయకీ! నీదేహము అప్రాకృతమును స్వతస్సిద్ధమును నగుటచే క్రియచే నేర్పడిన దనుప్రశంసనుఁగూడ నవకాశము లేనిది. అట్టి నీదేహమును మార్దవము శైత్యము సౌందర్యము మాధుర్యము మొదలగుగుణములతోఁ గూర్పఁదలఁచి నీ తండ్రియగు సముద్రుఁడు, చంద్రుఁడు కల్పలత అమృతము సుర మొదలగు పదార్థములనుండి సారమగుభాగము నెత్తుకొనుటచే నవి నిస్సారములైనవి. అట్లు నీదేహనిర్మాణమునకు వలయు సారపదార్థములు కలిగియుండుటచేతనే యవి వెల పొడవైన

తోడను ప్రియుని పరిచయమునందలి కోరికచే భయభక్తులచే సంకోచింపఁజేయఁబడిన పార్శ్వభాగముతోడను నొప్పుచు బంగరురేఖవలెను సంపెంగదండవలెను ప్రకాశమానముగను మనోహరముగను నలరారుచు ఉదారమైయుండు నీదివ్య మంగళవిగ్రహము ఇట్టిదని వాక్కులచేఁ జెప్పుటకు శక్యము కానియతిశయము కలిగియున్నది.

అ. ఆశ్రితరక్షణమున కనుకూలమగుస్థితియం దాసీనయై యుండు లక్ష్మియొక్క విగ్రహము ననుసంధించుచున్నారు.—

శ్లో. ఏకం న్యంచ్య నతిక్షమం మమ పరం
చాకుంచ్య పాదాంబుజం
మధ్యేవిష్టరపుండరీక మభయం
విన్యస్య హస్తాంబుజమ్,
త్వాం పశ్యేమ నిషేదుషీం ప్రతికలం
కారుణ్యకూలంకష
స్ఫారాపాంగతరంగ మమ్బ! మధురం
ముగ్ధం ముఖం బిభ్రతీమ్. 38

టీ. హేఅంబ = ఓతల్లీ ! మమ = నాయొక్క, నతిక్షమం- నతి = నమస్కారములకు, క్షమం=యోగ్యమగు, ఏకం = ఒక, పాదాంబుజం = పాదపద్మమును, న్యంచ్య = చాపియుం, పరం= మఱియొక, పాదాంబుజం = పాదపద్మమును, ఆకుంచ్యచ = ముడిచియుం, అభయం=అభయమునిచ్చు, హస్తాంబుజం=పద్మము

హిమాంభః=మంచునీటియొక్క, ప్లుతిభిరివ = చల్లుటలచేతవలె, నవత్వం=క్రొత్తదనమును, వహతి=వహించుచున్నదో.

తా. సేవకుల కనంతైశ్వర్యమిచ్చు నోలక్ష్మీ! తామర రేకులవలె మిగులమృదువై వేదాంతములు తన్ను వర్ణించుటచే వాని కాఠిన్యమునోడఁగూర్చి కాంతునివక్షంబున వసించుదాన వగుట వావక్షంబునసే యలంకరింపఁబడియుండు వైజయంతీవన మాలికను చల్లనై మృదువైయుండు తనతాపము కలిగించి మంచునీళ్ళ చల్లుచేవలె యభినవత్వమును కలిగించి యొంతయు నొప్పుచుండు నీపాదయుగళమును నమస్కరింతును.

శ్లో. త్వత్స్వీకారకలావలేపకలుషా
రాజ్ఞాం దృశో దుర్వచా
నిత్యం త్వన్మధుపానమత్తమధుప
శ్రీనిర్భరాభ్యాం పరమ్,
దృగ్భ్యామేవ హి పుణ్డరీకనయనం
వేదో విదామాస తే
సాఞ్లక్ష్మి! తవాపలోకవిభవః
కా కాక్వా కయా వర్ణ్యతే. 40

టీ. హేలక్ష్మి=ఓ లక్ష్మీ! రాజ్ఞాం=రాజులయొక్క, దృశః= దృష్టులు, త్వత్...కలుషాః-త్వత్=నీయొక్క, స్వీకార=స్వీకారముయొక్క, కలా=అవయవముచేతనైన; అవలేప = గర్వముచేత, కలుషాః=కలుషములై, దుర్వచాః = చెప్పశక్యముకాని

శ్లో. ఆనందాత్మభి రీశమజ్జనమద
క్షీబాలసై రాగళ
ప్రేమార్ద్రైరపి కూలముద్వహాకృపా
సంప్లావితాస్మాదృశైః,
పద్మే! తే ప్రతిబిందుబద్ధకలిక
బ్రహ్మాదివిష్కంభకై
రైశ్వర్యోద్గమగద్గదై రశరణం
మాం పాల యాలోకితైః. 41

టీ. హేపద్మే=ఓలక్ష్మీ! ఆనందాత్మభిః = ఆనందస్వరూపము లైనవియు, ఈశ...అలసైః - ఈశ = సర్వేశ్వరునియొక్క, మజ్జన=మునుఁచుటచేనైన, మద=మదముచే, క్షీబ=పరవశములును, అలసైః=మందములునైనవియు, ఆగళప్రేమార్ద్రైరపి-ఆగళ=కంఠ పర్యంతమగు, ప్రేమ=ప్రేమచే, ఆర్ద్రైరపి=ఆర్ద్రములైనను, కూల ...ఆస్మాదృశైః-కూలముద్వహా=దరులొరసెడు,కృపా=దయచే, సంప్లావిత=తడుపఁబడిన, అస్మాదృశైః = మావంటివారలుకలిగిన దియు, ప్రతిబిందు...విష్కంభకైః-ప్రతిబిందు = బిందుబిందు వునను, బద్ధ=కట్టఁబడిన, కలిక=కలహముగల, బ్రహ్మాది=బ్రహ్మ మొదలుగాఁగల, విష్కంభకైః = నిర్వాహకులు కలిగినవియు ఐశ్వర్యోద్గమగద్గదైః-ఐశ్వర్య = సంపదయొక్క, ఉద్గమ=అభి వృద్ధిచేత, గద్గదైః=తొట్రుపడునవియు (నగు), తే=నీయొక్క,

టీ. హేఅంబ=ఓతల్లీ ! పంకజరజః - పంకజ = పద్మముల యొక్క, రజః=పరాగము, తే = నీకు, పాదారుంతుదమేవ - పాద=పాదములయందు, అరుంతుదమేవ = చిగురు దాకునట్లు బాధించునదిగనే, భవతి = అగుచున్నది, చేటీభృశాలోకితైః- చేటీ = చెలికత్తెలయొక్క, భృశ = అధికమగు, ఆలోకితైః = చూపులచేత, అంగగ్లానిః-అంగ = శరీరముయొక్క, గ్లానిః= ఆయాసము, భవతి=అగుచున్నది, అకి=మఱియు, లీలారవింద గ్రహః-లీలారవింద = లీలాకమలముయొక్క, గ్రహః=గ్రహణము, సాహసవిధౌ = సాహసకృత్యమునందు, భవతి = అగుచున్నది, హరిభుజే-హరి = విష్ణువుయొక్క, భుజే = భుజముల యందు, వనమాలయా=వనమాలచే, డోలా=ఊగయొలలాగుట, హాకష్టశబ్దాస్పదం=హా, కష్టం, అనుమాటలకుస్థానము, భవతి = అగుచున్నది, హేశ్రీః=ఓలక్ష్మీ! అతికోమలా=మిగులసుకుమార మగు, ఇయం=ఈ, తనుః=శరీరము, కేన = దేనిచే, వాచాం= మాటలయొక్క, విమర్దక్షమా = సంఘర్షమును సహించునదిగ, భవేత్=అగును?

తా. ఓతల్లీ! అతిమృదువగు నీయాసనపద్మమునందలిపరా గమే ములుకులునాటినట్లు మిగుల బాధించునంతటిసౌకుమార్యా తిశయముకలిగినవి నీపాదములు. చెలికత్తియలు పలుమాఱులు చూచుటచేతనే వాడిపోవుస్వభావము కలిగినది నీదేహము. నీవు లీలాకమలమును ధరించుటయే అతిసాహసకృత్యముగఁ దోఁ చును. సర్వేశ్వరునివక్షమున వనమాలయం దుయ్యెలలాడుచుం

...వ్యతికరః-శైశవయౌవన=బాల్యయౌవనములయొక్క, వ్యతికరః=మార్పు, తే=నీయొక్క, గాత్రేషు=అవయవములయందు, సౌరభం=సౌగంధ్యమును, సూతే=కలిగించుచున్నది.

తా. ఓరంగనాయకీ! నీ స్తనము లెంతవఱకు వ్యాపింపవలయునో అంతవఱకును ఇంకను పెరుఁగ నేలేదు. చూపులు కనుబొమల విఱుపు చిఱునగవులు మొదలగువాని విలాసములన్నియు స్వభావసిద్ధములుగనే యగపడుచున్నవి గాని యౌవనజనితమైనకృత్రిమరూపమగు ప్రౌఢత యేమియు నగపడుచుండలేదు. ఇట్లవయవ సౌందర్యాదులనిప్పుడిప్పుడే వెంపొందించుచు ప్రియుఁడనియెడు నుపదేశకుని సహాయములేక భోగములయందు ప్రవేశింప నశక్తతను వెల్లడించుచు మౌగ్ధ్యమును సూచించుచు బాల్యయౌవనములసంధియగు తారుణ్యమనియెడువయస్సు నీదేహమున నధికమగు రామణీయకమును వెలిబుచ్చుచున్నది. నిత్యతారుణ్యమును వహించియుండు లక్ష్మినిగ్రహమున నెల్లప్పుడును శైశవముచుండి యౌవనమునకు మాఱునప్పటిలక్షణము లగునవయవవర్ధనాదులను సహజవిలాసాదులును నలరారుచుండు ననిభావము.

శ్లో. ఆమోదాద్భుతశాలి యౌవనదశా
వ్యాకోచ మమ్లానిమత్
సౌందర్యామృతసేకశీతల మిదం
లావణ్యసూత్రార్పితమ్,
శ్రీరంగేశ్వరి! కోమలాంగసుమన
స్సందర్శనం దేవి తే

నమునామోపేతశ్లోక యనియెడుసూత్రముచే గ్రుచ్చఁబడిన దియగు నానావిధవర్ణనములుగలయట్టి యనియెడుపుష్పమాలిక నీ ప్రియునివక్షస్థలంబున నలంకరింప నెంతయుం దగియుండుచు. ఈపైఁ జెప్పఁబడినయట్లు లౌకికపుష్పములకంటె నత్యధికమగు సౌగంధ్యములచే నొప్పెడులక్ష్మీవిగ్రహమనుపుష్పాదికముతోఁ బోల్చుచు దనుజన్మృపవినాశాభిఘాతాదులచే నతికఠినమగు సర్వేశ్వరునివక్షంబున కత్యంతసుకుమారమగు లక్ష్మీవిగ్రహమలంకరణార్హమని యెంచ నసమయంబుల తొట్రుపడుచు వర్ణించుకవి నగు నేను నిందింపఁబడెను. అతికఠినమైనను ఆశ్రితసంరక్షణార్థము హరివక్షంబున లక్ష్మ్యవస్థాన ముచితమగుటచే వర్ణనమున కవికి తొట్రుపాటేలేని వర్ణన ముచితమైనదే యని తెలియఁదగినది.

శ్లో. మర్మస్పృశో రసశిరా వ్యతివిధ్య వృత్తైః
కాంతోపభోగలలితై ర్లులితాంగయష్టిః,
పుష్పావళీవ రసికభ్రమరోపభుక్తా
త్వం దేవి నిత్య మభినందయసే ముకుందమ్. 45

టీ. హే దేవి=ఓ దేవీ! మర్మస్పృశః=మర్మములను తాఁకెడు, రసశిరాః=రసనాడులను, వ్యతివిధ్య = నొక్కి, వృత్తైః = ప్రవర్తించిన, కాంత...లలితైః-కాంత = ప్రియునియొక్క, ఉపభోగ=సంభోగములయందలి, లలితైః = విలాసములచేత, లులితాంగయష్టిః-లులిత=నలుపఁబడిన, అంగయష్టిః = యష్టివంటి దేహముకలిగిన, త్వం=నీవు, రసిక...భుక్తా-రసిక = రసికమగు, భ్రమర=తుమ్మెదచే, ఉపభుక్తా=అనుభవింపఁబడిన, పుష్పావళీవ

అందెలు, ప్రాయైః = ప్రధానములగు, ముగ్ధవిభూషణైః = సుందరాభరణములచే, ప్రకృతిమధురం=స్వభావముచే సుందర మగు, గాత్రం = దేహము, వలయశకలైః = కలకండముక్కలచే, దుగ్ధంయథా = పాలనుబోలియు, పుష్పైః = పూవులచే, కల్పలతాయథా = కల్పలత యట్లును, జాగర్తి = మిగుల నొప్పుచున్నది.

తా. నారాయణుని ప్రాణనాయకి వగు నో శ్రీరంగనాయకీ ! స్వభావముచేతనే మిగుల సుందర మగునీదేహము బంగరుమొలనూలు ముత్తెపుకమ్మలు హారములు పాపటబొట్టు రత్నపుసరులు అందెలు నను నివి ప్రధానములై యలరారెడు అనేకములగు సుందరాభరణములచే కలకండచే పాలును పూవులచే కల్పలతయు మిగుల శోభించునట్లు ఎంతయు శోభించుచున్నది.

శ్లో. సామాన్యభోగ్యమపి కౌస్తుభవైజయన్తీ
పంచాయుధాది రమణస్స్వయమేవ బిభ్రత్,
తద్భారఖేద మివ తే పరిహర్తుకామః
శ్రీరంగధామమణిమంజరి గాహతే త్వామ్. 47

టీ. హే శ్రీరంగధామమణిమంజరి - శ్రీరంగధామ = శ్రీరంగదివ్యవిమానమునకు, మణిమంజరి = రత్నగుచ్ఛ మగునో రంగనాయకీ! యువయోః = మీకిద్దఱకును, సామాన్యభోగ్య మపి - సామాన్య = సామాన్యముగ, భోగ్యమపి = అను

టీ. దర...అక్షి - దర = కొంచెము, దళత్ = వికసించెడు, అరవింద = పద్మముయొక్క, ఉదన్త = వృత్తివలె, కాంత = మనోహరమైన, ఆయత = విశాలములైన, అక్షి = నేత్రములు గలయోలక్ష్మీ ! మనుజతిరశ్చాం - మనుజ=మనుష్యులయందును, తిరశ్చాం = జంతువులయందును, లీలయా = విలాసముచే, తుల్యవృత్తేః=సమానమగువర్తనమును కలిగి యుండు, స్వాకస్య= ప్రియునకు, అనుజనుః = జన్మజన్మమునను, అనురూపా = తగురూపముకలదానవై, త్వం = నీవు, నావాతరిష్యోయది = అవతరింపకుందువేని, హేదేవి - మాతః = ఓదేవి ! తల్లీ ! నర్మ = విలాసము, అపరసం = రసవిహీనమై, అభవిష్యత్ = ఉండియుండును.

తా. కొంచెముగనప్పుడె వికసింపుచుండు పద్మముయొక్క గర్భపత్రములవలె మనోహరమై విశాలమై యొప్పుకన్నులు గలుగునో శ్రీరంగనాయకీ ! తల్లీ ! భగవంతుని లీలానుభవము కొఱకు సురనరతిర్యక్ స్థావరదేహంబుల రామకృష్ణమత్స్య వరాహాదిరూపంబున నవతరించుచుండ నీవును తత్తదుచితమగురీతి దేహధారణమును జేసియవతరింపకపోయినచో భగవంతునిలీలానుభవము నిస్సారముగ పరిణమించెడిది. నీవట్లు ఆయాయవతారములయందు తగినదేహపరిగ్రహణము చేసి కూడ నవతరించుటచేతనే లీల రస్యముగ పరిణమించెను.

అ. పైవిషయమున నుదాహరణమును జూపుచున్నారు.—

నాసుడితుండి చిఱునగవును చూపులును ననునమృతమును వెద చల్లుచు ఆవిర్భవించితివి.

అ. లక్ష్మీదేవియొక్క క్షమావిశేషము నుపవర్ణింపుచున్నారు.-

శ్లో. మాత ర్మైథిలి! రాక్షసీ _స్త్వయి తదై
వార్ద్రాపరాధా _స్త్వయా
రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా
రామస్య గోష్ఠీ కృతా,
కాకం తం చ విభీషణం శరణ మి
త్యుక్తిక్షమా రక్షత
స్సా న స్సాంద్రమహాగస స్సుఖయతు
క్షాన్తి _స్త వాకస్మికీ. 50

టీ. మాతః = తల్లీ! మైథిలి = సీతా ! తదైవ = అప్పుడే, త్వయి=నీయందు, ఆర్ద్రాపరాధాః-ఆర్ద్ర = నూతనమగు, అపరాధాః=అపరాధముఁగలిగియుండు, రాక్షసీః=రాక్షసస్త్రీలను, పవనాత్మజాత్ =ఆంజనేయునివలననుండి, రక్షంత్యా = రక్షించుచుండెడి, త్వయా = నీచేత, శరణమితి = 'శరణం' అనియెడు, ఉక్తిక్షమా = వచనమునకు సమర్థులగు, కాకం=కాకాసురుని, తం = ఆ, విభీషణంచ = విభీషణుని, రక్షతః = రక్షించునట్టి, రామస్య = రామునియొక్క, గోష్ఠీ=గోష్ఠి, లఘుతరా=లఘువైనదిగ, కృతా = చేయఁబడినది, సా = అట్టి, ఆకస్మికీ = నిర్హేతుకమగు, తవ = నీయొక్క, క్షాంతిః = ఓర్పు, సాంద్ర...ఆగసః - సాంద్ర = దట్టమగు, మహాత్ =గొప్ప, ఆగసః=

పశ్యేమ ప్రతియామ యామ చ పరి
చారాన్ ప్రహృష్యేమ చ. 51

టీ. మాతః = తల్లీ ! లక్ష్మి = లక్ష్మీ ! మైథిలజనోయథా= మిథిలానగరమునందలి జనులెట్లులనో, తేనాధ్వనా = ఆమార్గమున, వయం = మేము, త్వత్ ...సుభగైః - త్వత్ = నీ యొక్క, దాస్య = కైంకర్యమునందలి, ఏకరస = ముఖ్య ప్రీతిచేతనగు, అభిమాన = అభిమానముచే, సుభగైః = మనోహరములగు, భావైః = భావములతో, ఇహ = ఇచ్చటను, అముత్ర చ = పరమునను, జామాతేతి = అల్లుఁడనియుఁ, తవ= నీయొక్క, దయితేతి = ప్రియుఁడనియు, భవతీ...దృష్ట్యా - భవతి = నీయొక్క, సంబంధ = సంబంధమునందలి, దృష్ట్యా= దృష్టిచేత, హరిం=సర్వేశ్వరుని, పశ్యేమ = చూతుము, ప్రతియామ = పొందుదుము, పరిచారాన్ = కైంకర్యములను, యామ = పొందుదుము, ప్రహృష్యేమ=ఆనందింతుము.

తా. తల్లీ ! లక్ష్మీ! నీవు సీతగా నవతరించినపుడు మిథిలానగరపుజనులు నీయందలి యభిమానభావమునుబట్టి జనకమహారాజు అల్లుఁడనియుం నీప్రియుఁడనియుం సర్వేశ్వరునియం దెట్లు గౌరవము చూపుచుండిరో అట్లే మేమును సర్వేశ్వరునియందు నీప్రియుఁడనియుం విష్ణుచిత్తుని యల్లుఁడనియుం నీయందలి భక్తిభావమువలన గౌరవము చూపుచు భగవంతుని దర్శనము చేయుచుందుము. శరణముఁ బొందుదుము. కైంకర్యముఁ జేతుము. వీనిచే యానందింతుము.

ఘటులగుమీరుగూడ హేయమునకవకాశము నొసంగవచ్చునా?' అనునిట్టిమాటలచేతను ఇతరోపాయములచేతను సర్వేశ్వరునిమనశ్శ కాలుష్యమును దొలఁగించి చేతనులదోషముల మఱపించి సర్వేశ్వరునకు వీనియందనుగ్రహము కలుగునట్లుజేసి చేతనుల నీశ్వరుని స్వజనముగఁజేసెదవు. కావుననే నీవు మాకు తల్లివైతివి. ఇట్లు మీయుద్దరియందును హితపరత్వప్రియపరత్వములనుబట్టి చేతనులతో పితృమాతృ సంబంధము కలిగియుండుట స్థిరపడుచున్నది.

శ్లో. నేతుర్నిత్యసహాయినీ జనని నః
త్రాతుం త్వ మత్రాగతా
లోకే త్వన్మహిమావబోధబధిరే
ప్రాప్తా విమర్దం బహు,
క్లిష్టం గ్రావసు మాలతీమృదు పదం
విశ్లిష్య వాసో వనే
జాతః ధిక్కరుణాం ధిగస్తు యువయోః
స్వాతంత్ర్య మత్యంకుశమ్. 53

టీ. హేజనని=ఓతల్లీ! నేతుః=నాయకుఁడగు సర్వేశ్వరునకు, నిత్యసహాయినీ=నిత్యసహాయురాలవై యుండు, త్వం=నీవు, ఆగతా=వచ్చినదానవై, త్వత్ ...బధిరే-త్వత్ = నీయొక్క, మహిమా = మహిమలయొక్క, అవబోధ=తెలియుటయందు, బధిరే=చెవిటిదగు, అత్ర=ఈ, లోకే=లోకమున, బహు=అధికమగు, విమర్దం=కష్టమును, ప్రాప్తా=పొందితివి, మాలతీమృదు=మాలతీలతపలెకోమలమగు, పదం=అడుగు, గ్రావసు=కొండరాళ్ళ

అపి దశముఖం లూత్వా రక్షఃకబంధ మనర్తయ
త్కిమివ నపతిః కర్తా త్వచ్చాటుచుంచుమనోరథః.

టీ. హే మైథిలి=ఓ జానకీ! నాథః=నీనాథుఁడు, అబ్ధిం = సముద్రమును, అధిశయితవాన్ = శయనించెను, తం=దానిని, మమంథ=తరిచెను, బబంధ=కట్టెను. అసౌ = ఈనీప్రియుఁడు, హరధనుః=హరునివింటిని, వల్లీభంజం=తీఁగవిఱిచినట్లు, బభంజచ= విఱిచెను, దశముఖం = పదిశిరస్సులను, లూత్వా=నఱికి, రక్షః కబంధం = రాక్షసుని మొండెమును, అనర్తయత్=ఆడించెను, త్వత్ ... మనోరథః-త్వత్ = నీయొక్క, చాటు=ప్రియముచే, చుంచు=సంపన్నమగు, మనోరథః=కోరికకలవాఁడై, పతిః=నీభర్త, కిమివ=దేనిని, నకర్తా=చేయఁడు!

తా. జానకీరూపిణి యగునోలక్ష్మీ! నీనాథుఁడు నీ జన్మస్థానమను ప్రీతిచే సముద్రమున శయనించెను. నిన్ను పొందుటకై సముద్రము తరిచెను. సేతువుచే కట్టివైచెను. తీఁగనువిఱిచిన ట్లతిసులభముగ హరధనుస్సును విఱిచివైచెను. అతిబలవంతుఁడగు రావణుని పదితలలను నఱికివైచి చంపెను. ఇట్లు నీకు ప్రియము నాచరించుటయే తనమనోరథమునకు పూర్తియనుతలంపున నేకార్యమును చేయఁడు! ఎట్టి అఘటితములగు కృత్యములైనను ఘటితములుగ చేయు ననుట.

శ్లో. దశశతపాణిపాదవదనాక్షిముఖై రఖిలై
రపి నిజవైశ్వరూప్యవిభవై రనురూపగుణైః

ఉదధిపరమవ్యోమ్నో ర్విస్మృత్యమాదృశరక్షణ
క్షమమితి ధియాభూయః శ్రీరంగధామని మోదసే.

టీ. హే జనని=ఓతల్లీ! జనన... ప్రీత్యా - జననభవన=జన్మగృహమనియెడు, ప్రీత్యా=ప్రేమచే, దుగ్ధార్ణవం=పాలసముద్రమును, బహుమన్యసే=గౌరవించుచున్నావు, దయితప్రేమ్ణా-దయిత=ప్రియునియందలి, ప్రేమ్ణా=ప్రీతిచే, తత్=ప్రసిద్ధమగు, పరమంపదం=పరమపదమును, పుష్ణాసి=పోషించుచున్నావు; ఉదధిపరమవ్యోమ్నోః=పాలసముద్రముపరమపదమును, విస్మృత్య=మఱచి,మాదృశరక్షణక్షమమితి-మాదృశ=మావంటివారియొక్క, రక్షణ=రక్షించుటకు, క్షమంఇతి=తగినదనియెడు, ధియా=అభిప్రాయముతో, శ్రీరంగధామని = శ్రీరంగదివ్యవిమానమునందు, భూయః=అధికముగ, మోదసే=ఆనందించుచున్నావు.

తా. అమ్మా ! పాలసముద్రము నీకు జన్మస్థానమగుటచే ఆప్రీతినిబట్టి దానిని గౌరవించుచు అచ్చట నివాసమేర్పఱచుకొంటివి. పరమపదము నీప్రియునివాసస్థానమగుటచే నచ్చట నివాసమేర్పఱచి దానికి పోషణమునొసంగితివి. అకించనుల మగుమమ్ముల నందఱ నుద్ధరింప వీలుగనుండు ననుతలంపున నారెండుస్థలములను మఱచి శ్రీరంగదివ్యవిమానమున రంగనాయకికై యవతరించి యచ్చట నిత్యనివాస మేర్పఱచితివి. ఈమూఁడు స్థలములయందును నీనిత్యనివాసమునకు కారణములివి.

అ. శ్రీరంగనాయకి రూపమగునీయర్చారూపమునందు సర్వగుణపౌష్కల్యము కల దనుచున్నారు.—

అ. లక్ష్మీదేవియొక్క ఔదార్యాతిశయమును వర్ణించుచున్నారు.——

శ్లో. ఐశ్వర్య మక్షరగతిం పరమంపదం వా
కస్మైచి దంజలిభరం వహతే వితీర్య,
అస్మై న కించి దుచితం కృత మిత్యథాంబ
త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః 58

టీ. అంబ=తల్లీ ! అంజలిభరం = అంజలియనుభారమును, వహతే=వహించుచుండెడి, కస్మైచిత్=ఒకానొకనికొఱకు, ఐశ్వర్యం=ఐశ్వర్యమును, అక్షరగతిం=కైవల్యమును, పరమంపదంవా=పరమపదమును, అరః=పూర్ణముగా, వితీర్య=ఇచ్చి, అస్మై=వీనికొఱకు, ఉచితం=తగినది, కించిదపి=కొంచెమును, న కృతం=చేయఁబడలేదు, ఇతి=అని, లజ్జసే=సిగ్గుపడుదువు, అయం=ఈ, ఉదారభావః=ఔదార్యము, కః=ఎట్టిది? కథయ=చెప్పుము.

తా. తల్లీ! నీవు ఎట్టివానికైనను అంజలిపట్టి యడిగినంతమాత్రముననే వాఁడెంతో కష్టపడినట్లెంచి వానివాని అభీష్టము ననుసరించి ఇహలోకసౌఖ్యము నిచ్చు ఐశ్వర్యమునో పారలౌకికమగు కైవల్యమునో పరమపురుషార్థమగు మోక్షమునో దేనినైనను పూర్ణముగ నిచ్చివేసియుం భక్తుని శ్రమ కనుగుణమగుఫలము నీయలేదని తలఁచి సిగ్గుపడుచుందువు. అమ్మా! నీయౌదార్యమునుగుఱించి యిట్టిదని మేము చెప్పఁగలమా?

తల్లీ ! ఇట్లు మూర్ఖవ్యాపారములచే నీకు సర్వవిధముల భరింప శక్యముగాకయున్నాను.

శ్లో. ఇత్యుక్తికైతవశతేన విడంబయామి
తానంబ సత్యవచసః పురుషాన్ పురాణాన్,
యద్వా న మే భుజబలం తవ పాదపద్మ
లాభే త్వమేవ శరణం విధితః కృతాఽసి. 60

టీ. అంబ=తల్లీ ! ఇతి=ఇట్లు, ఉక్తికైతవశతేన-ఉక్తికైతవ = వాక్కపటములయొక్క, శతేన=సమూహముచే, సత్యవచసః= నిజములగువాక్కులుగల, పురాణాన్=పూర్వికులగు, పురుషాన్ =పురుషులను, విడంబయామి=అనుకరించుచున్నాను, యద్వా= లేనిచో, తవ=నీయొక్క, పాదపద్మలాభే - పాదపద్మ=పాద పద్మములయొక్క, లాభే=పొందుటయందు, మే=నాకు, భుజ బలం = సామర్థ్యము, నాస్తి=లేదు, త్వమేవ = నీవే, విధితః= విధిచే, శరణం=రక్షకమై, కృతా = చేయఁబడినదానవు, అసి= అయితివి.

తా. ఓతల్లీ! పైచెప్పఁబడినయట్లు భక్తివిరహితములై భక్తి సూచకములై యుండుకపటవాక్యసమూహముల నుపయోగించి సత్యవాక్కులై భగవన్నిర్హేతుకజాయమానకటాక్షలబ్ధవిశదతమ జ్ఞానశాలులై యొప్పుచుండు నాథయామునయతివరాదు లగు పూర్వాచార్యుల ననుకరించుచున్నాను. నిజమైనభక్తి లేకున్నట్టు తదనుకరణమాత్రమునే ఆధారముగ గ్రహించి రక్షింపుము. అను

కైంకర్యము, రసికాం=రసముగాఁగలిగిన,పరాం=ఉత్కృష్టమగు, సమృద్ధిం=సమృద్ధిని, భుక్త్వా=అనుభవించి, యుష్మత్ ...రజః=యుష్మత్ = మీయొక్క, పాదసరోరుహ = పాదపద్మముల యొక్క, అంతర = మధ్యమందలి, రజః=పరాగము, స్యామ=ఆగుదుముగాక, త్వం=నీవు, అంబా=తల్లియుఁ, పితా=తండ్రియుఁ, అసి = అయితివి, సర్వంచ=సమస్తమును, నః=మాకు, త్వమేవ=నీవే, భవ=కమ్ము, అకస్మాత్కృపాం=నిర్హేతుకదయను, స్వీకురు=స్వీకరింపుము.

తా. ఓతల్లీ! పుత్ర పౌత్ర బంధుశిష్య ప్రశిష్యాదు లగుసుహృత్తులతోఁగూడి బాధకములుగాని దుఃఖములుగాని లేకుండగను సుఖముగను కైంకర్యరసమును అనుభవించుచు నీ పాదదాసులమై పురుషజీవితమగు శతవత్సరముల కాలము ముగియునంతదనుక శ్రీరంగదివ్యక్షేత్రమున నిరంతరవాసముఁ జేతుముగాక. నీవే మాకుతల్లియుఁ దండ్రియుఁ నగుటచే నీనిరుపాధిక బాంధవ్యమును బట్టి మాయీకోరికను నిర్వర్తింపుము. ఇట్టికోరికను పొందుటకు సాధనము మాయొద్ద లేకపోయినను సర్వవిధములగుధర్మములు గను నీవేకావలయును. ఇట్లుకావలయు నని కోరుటకు నీనిరుపాధికదయతప్ప మాకు వేఱుకారణము లేదు. కావున నోతల్లీ! నీనిరుపాధికమగుదయను మాయందు ప్రసరింపఁజేసి సర్వవిధ సాధనములను సమకూర్చిన నీవే దయతో మాకోరికను నిర్వర్తింపుము.

వి. వి. "నాహం వందే తవ చరణయోర్ద్వంద్వ" మిత్యాదులచే సూరులనుసంధించునట్లు వీరును ఐహలౌకిక పారలౌకి

రసికాం పరాం సమృద్ధిం భుక్త్వా యుష్మత్పాదసరోరుహాంతర రజః స్యామ" యనుచున్నారు. మీ కైంకర్యరససమృద్ధియు మీపాదపద్మానురక్తియు మాకు పరమపురుషార్థము. తక్కిన వన్నియు పూర్వకర్మానురూపములై కాదగినవి. "పరాం" పరమునందలి దాస్యరససమృద్ధికంటె శ్రీరంగమందలి దాస్యరససమృద్ధి పరమైనది. ఇట్లు మీరుకోరుటకును మేమిచ్చుటకును నిర్బంధమే మంటివేని "త్వమంబా ఖ్యాతా చాసి" తల్లిదండ్రులకంటె నితరులెవ్వరు కోరికలందీర్తురు. అయినను మీకోరికల నిర్వర్తించుటకు వలయుసత్కర్మానుష్ఠానమేమియు నగుపడదే? అట్టిధర్మములేవియు మీయందు లేక ఊరక మా పాదదాస్యము నొసగుట కెట్లుచితమగు నందురేమో? "నః సర్వంచ త్వమేవ భవ" మాకు కావలసినసర్వధర్మములును నీవే కమ్ము. మాకు కావలయుసర్వధర్మములస్థానమునను నీవే పురుషకారస్వరూపిణివై యుండి సర్వేశ్వరునితోఁ జెప్పి మాకోరికల నిర్వర్తింపుము "స్వీకుర్వేకస్మాత్కృపాం" నాయీనిర్బంధమంతయు నాకొఱకు కాదు. ఇట్లు చేయవేని నిరుపాధికపరమకృపావంతురాలవగు నీస్వరూపమునకే హానికలుగును. కావున తగుననుష్ఠానములతో రావలసినదని మము నిర్బంధించుట నీపరమకృపకు హానికరమగుటచే నట్లనరాదు.

ఆంధ్రటీకాతాత్పర్య విశేషవివరణసహితమగు

శ్రీ గుణరత్నకోశము

సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1933.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీమద్రామాయణము, వ్యాఖ్యానచతుష్టయవిశిష్టము, 2 సంపుటములు, చిన్నసైజున చక్కగముద్రితము | 15 | 0 |
| ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యవిశేషార్థసహిత శ్రీమద్రామాయణము, షట్కాండలు, 15 వాల్యములు | 70 | 0 |
| డిటో బాలకాండము ... | 10 | 0 |
| డిటో అయోధ్యాకాండము ... | 15 | 0 |
| డిటో అరణ్యకాండము ... | 10 | 0 |
| డిటో కిష్కింధాకాండము ... | 10 | 0 |
| డిటో సుందరకాండము ... | 10 | 0 |
| డిటో యుద్ధకాండము ... | 20 | 0 |
| శ్రీమద్రామాయణము, ఉత్తరకాండసహా, ఆంధ్రతాత్పర్యసహితము, 7 వాల్యములు ... | 17 | 0 |
| డిటో బాలకాండము, ఆంధ్రతాత్పర్యసహితము | 2 | 0 |
| డిటో అయోధ్యాకాండము ,, ... | 3 | 0 |
| డిటో అరణ్యకాండము ,, ... | 2 | 0 |
| డిటో కిష్కింధాకాండము ,, ... | 2 | 8 |
| డిటో సుందరకాండము ,, ... | 2 | 0 |
| డిటో యుద్ధకాండము ,, ... | 4 | 0 |
| డిటో ఉత్తరకాండము ,, ... | 2 | 8 |

## వైదికగ్రంథములు.

| | | |
|---|---|---|
| అమావాస్యాతర్పణము ... | 0 | 1 |
| ఆపస్తంబగృహ్యసూత్రములు ... | 0 | 3 |
| ఆపస్తంబప్రవరకాండ, సటీక ... | 0 | 3 |
| ఆశ్వలాయనప్రవరకాండ, సటీక ... | 0 | 2 |
| ఆబ్దికమన్త్రములు (యజుర్వేదము), మూలము | 0 | 6 |
| ఆంధ్రద్రావిడసంధ్యావందనము ... | 0 | 2 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| యజుర్వేదసంధ్యావందనభాష్యము ... | 0 | 8 |
| యాజుషపూర్వప్రయోగచంద్రిక, సస్వరము—అనేకవిషయములఁ జేర్చి యాంధ్రమహాజనసంప్రదాయానుసారముగఁ బరిష్కరించి ముద్రించియున్నాము. మేలుప్రతి | 2 | 0 |
| రుద్రము, నమకము, చమకము, సస్వరము, చిన్నసైజు | 0 | 2 |
| శ్రీవైష్ణవాహ్నికము, చిన్నసైజు .. | 0 | 4 |
| శ్రీవైష్ణవశ్రాద్ధప్రయోగము ,, ... | 0 | 4 |
| వ్రతచూడామణి, (సంస్కృతము), చక్కనిప్రతి | 2 | 0 |
| వ్రతరత్నాకరము, ప్రథమభాగము ... | 0 | 8 |
| సత్యనారాయణవ్రతకల్పము, క్రొత్తకూర్పు ... | 0 | 6 |
| సూర్యనమస్కారము, చిన్నసైజు ... | 0 | 1 |

## జ్యోతిష గ్రంథములు.

| | | |
|---|---|---|
| అష్టకవర్గు, సాంధ్రతాత్పర్యము, చక్కనిప్రతి | 0 | 4 |
| అఱువదిసంవత్సరముల (గడచినసంవత్సరముల) దృగ్గణిత పంచాంగములు ... | 8 | 0 |
| ఆరూఢరత్నసిద్ధాంజనము, సాంధ్రతాత్పర్యము | 0 | 12 |
| కాలామృతము, ఆంధ్రతాత్పర్యము ... | 1 | 0 |
| కృష్ణవాస్తుశాస్త్రము అను వాస్తుసారసంగ్రహము | 0 | 8 |
| కేరళప్రశ్నము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 3 |
| గౌళిశాస్త్రము, తెనుఁగు ... | 0 | 2 |
| ఛప్పన్నము. ప్రశ్నశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము | 0 | 6 |
| జలార్గళశాస్త్రము, ఆంధ్రతాత్పర్యసహితము | 0 | 4 |
| జాతకచంద్రిక, గోపాలరత్నాకరము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 8 |
| బృహజ్జాతకము, ఆంధ్రటీకాతాత్పర్యవివరణసహితము | 2 | 0 |
| బృహద్యోగరత్నాకరము, తెనుఁగువచనము ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | |
|---|---|---|
| ధర్మసింధువు, తెనుఁగువచనము ... | 4 | |
| పరాశరస్మృతి, సాంధ్రతాత్పర్యము ... | 0 | |
| పులస్త్యస్మృతి, సాంధ్రటీక ... | 0 | |
| బుధస్మృతి, సాంధ్రతాత్పర్యము ... | 0 | |
| బృహస్పతిస్మృతి ,, ... | 0 | |
| వృద్ధపరాశరస్మృతి, సాంధ్రటీక ... | 0 | |
| మనుస్మృతి, సంస్కృతాంధ్రవ్యాఖ్యానసహితము | 4 | |

### వేదాంతగ్రంథములు.

| | | |
|---|---|---|
| అపరోక్షానుభూతి, సాంధ్రతాత్పర్యము, చిన్నసైజు | 0 | |
| అద్వైతపంచరత్నములు ,, ... | 0 | |
| అద్వైతానుభూతి ,, ... | 0 | |
| అద్వైతోపదేశపంచరత్నములు (సాధనపంచకము) | 0 | |
| అద్వైతసంగ్రహము, తెనుఁగువచనము ... | 0 | |
| అష్టోత్తరశతోపనిషత్తులు, చక్కనికూర్పు ... | 6 | |
| ఆత్మబోధము, సటీక ... | 0 | |
| ఆనందలహరి, ఆంధ్రతాత్పర్యసహితము ... | 0 | |
| ఆత్మపూజ ,, ... | 0 | |
| ఆత్మవిద్యావిలాసము ,, ... | 0 | |
| ఆత్మానాత్మవివేకము ,, ... | 0 | |
| ఉత్తరగీతా, సాంధ్రటీకాతాత్పర్యము, చిన్నసైజు | 0 | 1 |
| జ్ఞానవాసిష్ఠము, ఆంధ్రతాత్పర్యసహితము ... | 8 | |
| జీవన్ముక్తిప్రకాశిక, ఆంధ్రతాత్పర్యసహితము ... | 2 | |
| నైష్కర్మ్యసిద్ధి, సురేశ్వరాచార్యకృతము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము ... | 3 | |
| పంచదశీప్రకరణము, ఆంధ్రటీకాతాత్పర్యసహితము | 5 | |